
రామ్
శ్యామ్‌లను
బంధించారు !


"అదిగదిగో అలా చూడు
ఆ నగల కొట్టు దగ్గర
ఆ దొంగల ముఠాని పట్టుకోవాలి"


"పోలీసులకు మనగురించి
తెలిసేముందే, ఏయ్!
బంధించండా పిల్లలిద్దర్నీ
నాకళ్ళముందే"


"తోసేశారు ఓ పాతకారులోకి అతి
క్రూరంగా, తీసుకుపోయారు రామ్,
శ్యామ్‌లను ఎంతో దూరంగా"


ఓ కాళీ గుడిసెలో బంధించారు
మన బాలనాయకులిద్దర్నీ
గట్టిగా మూసేశారు


"ఇలారా, రామ్ దగ్గరికి! భయపడకు
పోలీసులు త్వరలోనే
ఇక్కడికి రావడం ఖాయం"


"నేనొక్క పక్కని గుర్తు వేసినాను,
త్రోవంతా ఈ తీయని బిళ్ళలు
ఫలితం కనిపించేదాకా"


"పండ్ల రుచిగల పాపిన్స్ దారి
అంతటా విసిరాను, అవే మమ్మల్ని
రక్షించాయి ఈ నాడు"

# వనిత

స్త్రీజన పక్ష పత్రిక

'జూలై ఒకటి' తేదీ గల

## ప్రారంభ సంచిక వెలువడింది

### ఈ సంచికలో....

ఇల్లిందల సరస్వతీదేవి, మాదిరెడ్డి సులోచనల కథలు, భానుమతీ రామకృష్ణ నాటిక. ప్రధాని ఇందిరాగాంధి ప్రత్యేక వ్యాసం, షావుకారు జానకి, మాలతీ చందూర్, ఉషారాణి భాటియాల వ్యాసాలు ఉన్నాయి. నగలు - అందచందాలు - వినియోగదార్లకు ఉపయోగకరమైన సమాచారం, కుట్టుపని బడి, బామ్మగారి పేజీ, రూ. 116=లు బహుమతి గల మాటల కొలువు-ఈ సంచికలోని మరికొన్ని ఆకర్షణలు.

సంవత్సర చందా రూ.24 లు     విడి ప్రతి: ఒక రూపాయి

---

## ఇదుగో వచ్చింది స్కాలర్!

బ్లాక్ బర్డ్ వారి నుంచి విద్యార్థులకు అతి చక్కని పెన్ను



ఇప్పుడు బ్లాక్ బర్డ్ వారు
ప్రత్యేకంగా విద్యార్థుల కోసం
'స్కాలర్'ను సృష్టించారు—
తేలికై సుందరమైన ఆకారంతో
చక్కగా చేతికి అమిరేందుకు
...పట్టులాగా సాఫీగా జారువారే
సిరాకోసం అతి సన్నని
ఇరిడియం కొనగల పాళీతో.
దానిని చూడండి. పరీక్షించండి.
పూర్తి మార్కులు పొందగల
అర్హత ఈ పెన్నుదేనని
మీరు అంగీకరిస్తారు!

స్కాలర్ పెన్ను—
ప్రపంచ ప్రఖ్యాత బ్లాక్ బర్డ్
పరివారం నుంచి మరొక
నాణ్యమైన పెన్ను

heros' SI-132 C TEL

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [''నేత్రగండం''] టి. వి. నరసింహకుమార్ రచన. శాస్త్రజ్ఞానం సక్రమంగా వినియోగిస్తే అందువల్ల ఎంతైనా లాభం ఉంటుంది. అయితే స్వార్థపరులు శాస్త్రజ్ఞానాన్ని దుర్వినియోగపరచినప్పుడు వాళ్లను క్షమించరాదు. అలాటివాళ్ల జ్ఞానానికి సత్కారం చేసినా, దుర్వినియోగాన్ని నిర్మొహమాటంగా శిక్షించాలి. లేని పక్షంలో స్వార్థాన్ని ప్రోత్సహించటమవుతుంది. ఇదే ఈ కథ లోని నీతి.

సంపుటి 57 జూలై '75 సంచిక 1




CHITRA




## 25

సింహం నదిలో స్నానం చెయ్యటానికి వెళ్లింది. అది వెళ్లగానే నక్క తోడేలుతో, ''మిత్రమా. మన దొర తిరిగి వచ్చే లోపున నువు కావలిస్తే కొద్దిగా ఎంగిలి పడు. చాలా ఆకలి మీద ఉన్నట్టున్నావు. సింహానికి నేను సర్ది చెబుతాను.'' అన్నది.

వెంటనే తోడేలు ఒంటె గుండెను తిన్నది. సింహం తిరిగివచ్చి, ఒంటె గుండె లేకపోవటం చూసి, భయంకరంగా గర్జిస్తూ, ''నా కన్న ముందుగా ఒంటెను తిన్నది ఎవరు? వాణ్ణి చంపిగాని భోజనం చెయ్యను.'' అన్నది.

''సర్ది చెబుతానన్నావుగా? చెప్పు!'' అన్నట్టుగా తోడేలు నక్క కేసి చూసింది.

కాని నక్క నవ్వుతూ, ''తోడేలన్నా, నన్ను చూస్తావేం? నువేగా గుండె తినేసిందీ?'' అన్నది.

తారెత్తిపోయి తోడేలు, ప్రాణం రక్షించుకునేటందుకు పరుగు లంకించుకున్నది. సింహం దాన్ని చాలాదూరం తరిమి, బాగా అలసిపోయి, ''ఈ కాస్త తప్పుకు తోడేలును చంపేదేమిటి?'' అనుకుంటూ తిరిగిరాసాగింది.

సింహం తిరిగి వచ్చేటప్పుడు దానికి గంటల చప్పుడు గట్టిగా వినిపించింది. దానికి కారణమేమిటంటే ఒక ఒంటెల బిడారు ఆ దారిగా పోతున్నది. ఒంటెల మెడల్లో ఉన్న గంటలు మోగుతున్నాయి.

''ఆ చప్పుడేమిటి?'' అని సింహం నక్కను అడిగింది.

''పారిపొండి, మహారాజా. మీకు పెద్ద ప్రమాదం రానున్నది!'' అన్నది నక్క.

''ఎవరి నుంచి ఆ ప్రమాదం?'' అని సింహం అడిగింది.

అట్ట చివరి బొమ్మ

"ఒంటెను చంపే ముందు మీరు ఒంటెకు నూరు శాతం వడ్డీ కూడా ఇస్తా మని మృత్యుదేవతకు మాట ఇచ్చారు గదా. అసలూ, వడ్డీ, వసూలు చేసుకునే టందుకు మృత్యుదేవత వస్తున్నది." అన్నది నక్క.

ఈ మాట వింటూనే సింహం పలా యనం చిత్తగించింది. తరవాత నక్క ఒంటె శరీరాన్ని చాలా రోజుల పాటు నిరభ్యంతరంగానూ, నిస్సంకోచంగానూ తిన్నది.

*  *  *

దమనకం వెళ్ళినాక సంజీవకం ఇలా ఆలోచించింది:

"నేనిప్పుడేం చెయ్యాలి? ఎక్కడి కైనా పారిపోదునా? లాభం లేదు. ఇది మహారణ్యం. నేను ఏ పులివాతనో పడక తప్పదు. సింహమా, శత్రువై కూర్చు న్నది. అందుచేత నాకు ఒకటే మార్గం - సింహం వద్దకు వెళ్ళి, ప్రాణ భిక్ష వేడటం!"

ఇలా అనుకుని సంజీవకం పింగళకం వద్దకు వెళ్ళింది. దమనకం ముందుగా చెప్పినట్టే సింహం తోక నిగిడించి ఉన్నది; పంజాలు బిగబట్టి ఉన్నాయి; కళ్ళు తీక్ష్ణంగా ఉన్నాయి. ఈ లక్షణాలను దూరం నుంచే గమనించి, సంజీవకం



కుమ్మటానికి సిద్ధంగా ఉన్నట్టుగా కొమ్ములు ముందుకు పెట్టింది.

పింగళకం కూడా, దమనకం ముందే చెప్పిన లక్షణాలను సంజీవకంలో గమ నించి, దాని పైన దూకి తన వాడి గోళ్లతో సంజీవకాన్ని చీల్చేసింది. దెబ్బ తిని కూడా సంజీవకం పింగళకాన్ని డొక్కలో కొమ్ముతో పొడిచి, కొంచెం వెనక్కు తగ్గి, మళ్ళీ పొడవటానికి సిద్ధమయింది.

ఉభయులూ అలా ఒకరినొకరు చంపు కునేటందుకుగాను యుద్ధసన్నద్ధులై ఉండడం చూసి, కరటకం దమనకంతో, "మూర్ఖుడా, మిత్రుల మధ్య శత్రుత్వం రేపి, నువు మహా పాపం చేశావు.

శాంతియుతంగా ఉన్న అరణ్యంలో అశాంతి తెచ్చి పెట్టావు. నువు ఏకంగా దండోపాయం అవలంబించి, మన ఏలికకు ప్రాణాపాయస్థితి కలిగించావు. ఆయన ఇతరులను సంప్రతించే అవకాశం కూడా ఇయ్యకుండా మంత్రాలోచన అంతా నువే చేశావు. నీ వంటి మూఢుడి మంత్రాలోచనలు విన్నందుకు మన యజమానిని చూసి నేను జాలిపడుతున్నాను. మన యజమాని తప్పు కూడా లేక పోలేదు. మూఢులైన రాజులు నీలాటి ఇచ్చకాలరాయుళ్ళ మాటలు విని నాశనం కొని తెచ్చుకుంటారు. నీలాటి వాడికి హితవు చెప్పటం కూడా వృథా. వెనకటికి కోతికి చెప్పిన హితువులాగే ఉంటుంది!" అన్నది.

"ఏమిటా కథ?" అని దమనకం అడిగింది. కరటకం ఇలా చెప్పింది:

నిరర్థకమైన హితవు

ఒక అరణ్యంలో కోతుల మంద ఉండేది. చలికాలం వచ్చి, కోతులన్నీ వణికి పోతున్నాయి. అంతలో వాటికొక మిణుగురు పురుగు కనబడింది. దాన్ని చూసి నిప్పురవ్వ అనుకుని, దాని సహాయంతో మంట చేద్దామని, దాన్ని పట్టుకుని, దాని మీద ఎండుటాకులు కప్పి, మంటకు వెచ్చబడదామని పోగు దగ్గిరచేరాయి.

వాటిలో చలి బాధ మరీ ఎక్కువగా ఉన్న ఒక కోతి, మంట త్వరగా కావటానికి మిణుగురు పురుగు మీద ఊద సాగింది. సమీపంలోగల ఒక చెట్టు మీద ఉన్న సూచీముఖి అనే ఒక పక్షి ఇదంతా చూసి, "మిత్రమా, ఎందుకు వృథాగా ప్రయాస పడతావు? అది నిప్పు కాదు, మిణుగురు పురుగు," అని చెప్పింది.

కోతి వినిపించుకోకుండా, అదే పనిగా ఊదుతూ పోయింది.

సూచీముఖి మళ్ళీ మళ్ళీ కోతిని ఉద్బోధించింది. కోతికి చిరాకు వచ్చి, సూచీముఖిని నోరు మూసుకోమన్నది. బుద్ధి మాలిన సూచీముఖి అదేపనిగా కోతికి హితవు చెప్పసాగింది.





## 13

[ఉదయనుడూ, అతడి యిద్దరు కవలసోదరులూ కాపలా రాక్షసుణ్ణి చంపివేసిం తరవాత, వాడి అన్న వచ్చి, కవలసోదరులను పట్టుకోబోయాడు. వాళ్ళు కోతులుగా మారి తప్పించుకున్నారు. ఆ సమయంలో అక్కడికొచ్చిన గడ్డపువాడు వాళ్ళకులొంగిపోయాడు. అన్న రాక్షసుణ్ణి చంపబోయిన ఉదయనుడు వాడికి చిక్కి, వాడిచేత బావిలోకి తోయబడ్డాడు. తరవాత—]

రాక్షసుడు. ఉదయనుణ్ణి బావిలో పడవేసి తన దారిన తాను వెళ్ళిపోయాడు. గడ్డపువాడి రూపంలో వున్న ఉదయనుడు, బావిలో వారం రోజులపాటు వుండిపోయాడు. అతడికి బైటపడేమార్గం కనిపించలేదు. ఇక అక్కడ భస్మంవల్ల అదృశ్యం చేయబడిన సంధ్యా నిశీథులు గడ్డపువాడితో సహా, అలా అదృశ్య రూపంలోనే వుండిపోవలసి వచ్చింది. ఎందుచేత నంటే వాళ్ళకు తిరిగి మామూలు స్వరూలు తెప్పించగల భస్మం ఉదయనుడి దగ్గిరే వున్నది.

వీళ్ళస్థితి యిలా వుండగా, ఈ వారం రోజులూ రాకుమార్తెలూ వూరుకోలేదు. క్షణమైనా విడవకుండా కనిపిస్తూవుండే, కవలసోదరులు కనిపించకుండా పోయేసరికి, వాళ్ళు మళ్ళీ ఏదో ఆపదలో చిక్కుకుని వుంటారని, వాళ్ళు వెంటనే గ్రహిం



చారు. వాళ్ళు, కవలసోదరుల కొసం చుట్టుపక్కల అంతా గాలించసాగారు.

ఇలా వెతుకుతున్న రాకుమార్తెలు, ఉదయనుడు పడివున్న బావి దగ్గిరకు కూడా రావటం తటస్థించింది. అయితే, ఉదయనుడు గడ్డపువాడి ఆకారంలో వుండటం చేత ఆ పొట్టిమనిషి వాళ్ళ కంటబడలేదు. వాళ్ళు బావి దగ్గిరకు వచ్చిన అలికిడి వినిపించి, ఉదయనుడు కేకవేశాడు. కాని, ఆకారానికి తగ్గట్టు కేకకూడా చిన్నది కావటం చేత, ఆ కేక రాకుమార్తెలకు వినిపించలేదు.

తను కేకపెట్టి కూడా రాకుమార్తెలకు తన స్థితి తెలియచేయలేక పోయినందుకు ఉదయనుడు మరింత దిగులుచెందాడు. ఐతే, ఆ క్షణమందే ఉదయనుడికి ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది.

రాక్షసుడు తనను బావిలో తోసివేశాక, ఒడ్డున పడివున్న కత్తికూడా బావిలో పడవేసి మరీ పోయాడు. ఇప్పుడు ఉదయనుడు ఆ కత్తిని బావిలోనుంచి తీసి, పైకి విసిరాడు. అది అమాంతం వచ్చి బావి యివతల భూమిలో దిగబడిపోయింది. ఈ కత్తి చూచి అయినా రాకుమార్తెలు, తాను బావిలోవున్న సంగతి తెలుసుకుంటారేమో అని ఉదయనుడి ఆశ.

మరొక వారానికి రాకుమార్తెలు మళ్ళీ ఆ బావి దగ్గిరకు రావటం జరిగింది. బావి ఒడ్డున భూమిలో దిగబడివున్న కత్తిని చూస్తూనే, వాళ్ళు ఆశ్చర్యపోయారు. "ఇదేమిటి? క్రిందటిమారు మనం యిటు వచ్చినప్పుడు లేని కత్తి, యిప్పుడు ఎక్కడి నుంచి వచ్చింది? ఒక వేళ రాక్షసుడు, ఉదయనుణ్ణి చంపి, యీ బావిలో పడవెయ్యలేదు గదా?" అనుకుంటూ వాళ్లు బావిలోకి తొంగి చూశారు.

చిత్రమేమిటోగాని బావిలో సగంవరకు రకరకాల పళ్ళు నిండివున్నై. వాటిపై గడ్డపువాడి వేషంలో ఉదయనుడు నిలుచుని వున్నాడు. అతని చేతిలో మాయ తువ్వాలు వున్నది. తువ్వాలులోనించి



పళ్ళు యింకా గుట్టలు గుట్టలుగా వస్తూనే వున్నై. పళ్ళతో బావి నిండిపోతున్నది.

ఆశ్చర్యంతో రాకుమార్తెలు అలాగే నిలబడిపోయారు. మరికొద్ది సేపటికల్లా పై అంచువరకు పళ్ళువచ్చేసి, బావి నిండిపోయింది. ఆ పళ్ళగుట్ట పైన నిలుచునివున్న ఉదయనుణ్ణి, రాకుమార్తెలు చెయ్యి పట్టుకు బైటికి లాగివేశారు.

అప్పుడు ఉదయనుడు, రాకుమార్తెలతో తను రాక్షసుడి తల తెగనరకటమూ, వాడు తనను బావిలోకి విసిరివెయ్యటమూ, అప్పుడు తను వేసిన వ్యూహాలూ—వాళ్ళకు వివరంగా చెప్పాడు. అంతా విన్న రాజకుమార్తెలు, "ఏమైతే నేం, ఇంతకూ మాయతువ్వాలు నిన్ను రక్షించింది. దానిని ఉపయోగించి యిలా బయట పడవచ్చుననే ఉపాయం, నీకు తోచినందుకే మెచ్చుకోవాలి," అన్నారు.

ఆ తరవాత అందరూ బయలుదేరి, గడ్డపువాడూ, సంధ్యానిశీధులూ అదృశ్య రూపంలోవున్న చోటుకు చేరుకున్నారు. ఉదయనుడు తనవద్దవున్న భస్మం ఆ చోట చల్లేసరికి, వాళ్ళు ముగ్గురూ తిరిగి మామూలు రూపం పొందారు.

అప్పటివరకూ జరిగినకథ తెలుసుకోవటంతోనే గడ్డపువాడు, "అయితే, రాక్షసుడు తను బావిలో తోసివేసింది, నన్నే అనుకున్నాడా? ఇదీ ఒకందుకు మంచిదే లే. ఇకముందు కథ ఆలోచించాలి," అన్నాడు.

అందుకు ఉదయనుడు, "నిజమే. అయితే యీమారు రాక్షసుడు వచ్చినప్పుడు నా కోసం బావిలో చూస్తాడుగదా? నేను అక్కడ లేకపోవటం, పైగా బావి పళ్ళతో నిండివుండటం చూసి, వాడు అనుమానపడడా?" అన్నాడు.

"వాడు వచ్చేసరికి, ఆ బావి అక్కడ వుండి వాడికంట బడితే గదా?" అన్నాడు గడ్డపువాడు.

వెంటనే వాళ్ళు బావి దగ్గరకు వెళ్ళి, భస్మం చల్లేసరికి, బావి మాయమై




పోయింది. దానికి బదులు మామూలు మైదానం కానవచ్చింది.

అప్పుడు ఉదయనుడు, గడ్డపువాడితో, "సరే, నువ్వు యిప్పుడు చెయ్యవలసిన పని ఒకటి వుంది. మేము రాకుమార్తెలను వెతకటానికి బయలుదేరి, యిప్పటికి ఏడు సంవత్సరాలు అయింది. అక్కడ రాజూ, రాణీ మేము ఏమైపోయామో అని కంగారుపడుతూ వుంటారు. కనక, నీవు యీ క్షణంలోనే శ్రావస్తీనగరానికి బయలుదేరి వెళ్ళి, రాకుమార్తెలూ, మేమూ క్షేమంగానే వున్నామనీ, త్వరలోనే ఇల్లు చేరుకుంటామనీ చెప్పి రావలసింది," అన్నాడు.

గడ్డపువాడు సరేనని చెప్పి, ఆ క్షణానే శ్రావస్తీనగరానికి ప్రయాణమయ్యాడు. అప్పుడు ఉదయనుడు తను మొట్టమొదట, ఈ మాయాభవనం ప్రవేశించబోయే ముందు కందకంలో పడిపోవటం, తన గుర్రాన్ని ఆ కందకంలోనే వుంచి, తను మాత్రం ఎలాగో బైటపడటం అంతా చెబుతూ, "కాలినడకన వెళ్ళితే, నీవు ఎప్పటికి చేరుకోగలవు? గుర్రం మీద పోయిరా. మొదట వారు నిన్ను నమ్మకపోవచ్చు. కాని, గుర్రాన్ని ఆనవాలు పట్టినతరవాత నమ్మితీరతారు," అన్నాడు.

ఉదయనుడి తెల్లగుర్రం మీద గడ్డపువాడు బయలుదేరాడు. వాడు అలా పోతూవుండగా, ఒక మైదానంలో ధానశీల మహారాజుగారి భటులు, సంధ్యానిశీధుల గుర్రాల పైన వస్తూ, గడ్డపు వాడికి ఎదురయ్యారు. తమ రాజుగారి తెల్ల గుర్రాన్ని చూస్తూనే వాళ్ళు గుర్తుపట్టి వేశారు. దానిపైన ఎవరో కొత్త మనిషి వుండటం చూసి, అటకాయించారు.

"ఎవరయ్యా నువ్వు? ఈ గుర్రం నీకెక్కడిది? ఇలా ఎక్కడికి పోతున్నావు? చెప్పి మరీ కదులు," అన్నారు.

అందుకు గడ్డపువాడు, "నేను దానశీల మహారాజుగారికి ఒక శుభవార్త అందించబోతున్నాను. అన్నట్టు, మీరు ఎక్క

వచ్చిన ఈ గుర్రాల్ని నేను యిదివరకే చూసినట్టుందే! మీరు మహారాజుగారి సేవకులా?'' అని అడిగాడు.

''అవునులే. నువు తెచ్చిన ఆ శుభ వార్త ఏమిటో ముందు చెప్పు,'' అంటూ వేగిరపెట్టారు రాజభటులు.

''రాకుమార్తెలూ, వారిని వెతకవచ్చిన కుర్రవాళ్ళూ, అంతా సుఖంగావున్నారు. ఈ మాట రాజుగారికి చెప్పాలి,'' అన్నాడు గడ్డపువాడు.

''అలాగా! మేమూ, నీతో వస్తాంపద,'' అన్నారు భటులు సంతోషంతో.

''అలాకాదు. ఒక పని చేద్దాం. ఇప్పుడు మనంకలిసి రాకుమార్తెలు వున్నచోటుకు పోదాం. మీరూ అక్కడే వుండిపోయి, వాళ్ళను కాపాడుతూ వుండండి. నేను తిరిగి వెళ్ళి రాజుగారికి, యీ వార్త అందించివస్తాను,'' అన్నాడు గడ్డపువాడు.

సరేనని వాళ్ళు కవలసోదరులున్న చోటుకు చేరుకున్నారు. భటులను అక్కడ వదిలి, గడ్డపువాడు మళ్ళీ బయలుదేరాడు.

కొంత దూరం వచ్చేసరికి సుడిగాలి ప్రారంభమైంది. రాక్షసుడి రాకకు యిది గుర్తుకదా అని, గడ్డపువాడు వెంటనే గ్రహించి, గుర్రాన్ని శరవేగంగా పోనీయ సాగాడు. ఐనా, రాక్షసుడు రివ్వునవచ్చి,






గుర్రంమీద పోతున్న గడ్డంవాడిని ఆకాశ
మార్గాన ఎత్తుకుపోయాడు.

గుర్రం మాత్రం అలా తిరుగుతూ,
తిరుగుతూ మరొక వారానికల్లా శ్రావస్తీ
నగరానికి పోయి, రాజమహలు చేరు
కున్నది. రాజు చూస్తూనే పరుగున
ఎదురువచ్చి, దానిని మహలులోకి తీసుకు
పోబోయాడు. కాని, అది రాజు వెంట
మహలులో ప్రవేశించక, మొండికేసి
వచ్చిన దారినే పోబోయింది.

సేవకులంతా పోగయారు. వాళ్ళతో
రాజు, ''ఉదయనుడు ఏమయ్యాడో,
ఈ గుర్రం యిక్కడికెలా వచ్చి చేరు
కున్నదో—ఏమీ బోధపడటం లేదు. దీని
చేష్టలు చూస్తే వాళ్ళు ఏదో ఆపదలో
చిక్కుకున్నట్టు తోస్తున్నది. భవనంలోకి
రాకుండా యిది వచ్చిన దారినే పోవ
టానికి పెనుగులాడటంలో, ఏదో రహస్యం
వుండి వుండాలి! కనక, ఇది ఎక్కడికి
పోతే మీరు అక్కడికిపోయి, ఏమిజరుగు
తుందో చూసిరండి,'' అన్నాడు.

రాజు యిలా చెబుతూవుండగానే;
గుర్రం పట్టువదిలించుకుని పోసాగింది.
రాజభటులు దానిని వెంబడించారు. కాని;
యింతలోనే ముందుకు పోతున్న గుర్రం;
రాజభటుల వైపుకు తిరిగి వాళ్లను;
'ఆగండి!' అన్నట్టు తల ఆడించింది.

ఇది చూడగా రాజుకు ఒక ఆలోచన
కలిగింది. మంత్రిని పిలిచి, ''వీళ్ళంతా
వెంటబడటం అశ్వానికి యిష్టం
లేనట్టుంది. వాళ్ళను వెనక్కు పంపిం
చెయ్యి. నీవు మాత్రం వెంటవెళ్ళు,'' అని
చెప్పి మంత్రిని పంపాడు.

భటులను తిరిగి మహలుకి పంపి
వేశాక, గుర్రం మళ్ళీ ముందుకు సాగింది.
అప్పుడు మంత్రి ఒక్కడూ దాని వెంట
పోసాగాడు.

* * *

అక్కడ కవలసోదరులూ, రాకుమా
ర్తెలూ చాలా ఆందోళన చెందసాగారు.
వార్త అందించి, తిరిగి వస్తానని చెప్పి

పోయిన గడ్డపువాడు, శ్రావస్తీనగరానికి బయలుదేరిపోయి పది రోజులైంది. ఇంత వరకూ వాడు తిరిగిరాలేదు. కపలసోదరులకు పరిపరివిధాల ఆలోచనలు పోయినై.

చివరకు ఒకనాడు ఉదయనుడు తన సోదరులతో, "పాపం, వాడు ఏమి ఆపదలో చిక్కుకున్నాడో, శ్రావస్తికిపోయి నేను కనుక్కువస్తా. అంతవరకూ మీరు జాగ్రత్తగా వుండండి. అవసరం అయితే యీ భస్మాలు వాడుకోండి," అని వాళ్లకు కొంత తెల్ల భస్మం, కొంత నల్ల భస్మం యిచ్చి, నిశీధుడి నల్లగుర్రం పైన, శ్రావస్తీ నగరానికి బయలుదేరాడు.



ఉదయనుడు తన ప్రయాణంలో ఒక రాజ్యం మధ్యనుంచి వెళుతూవున్నాడు. దారిలో ఒకచోట ఒక అంధుడు, కర్రతో తడుములాడుకుంటూ నడిచివస్తూ, పక్కనేవున్న ఒక గోతిలో పడిపోయాడు. ఈ దృశ్యం కంటబడగానే ఉదయనుడు అమాంతం గుర్రం మీంచి కిందికి దూకి, ఆ అంధుణ్ణి గోతిలోంచి లేవదీశాడు. అతడిపై తన దగ్గిరున్న అంజనాలు ప్రయోగించాడు. తక్షణమే అంధుడికి చూపు వచ్చేసింది. అతడు ఉదయనుడికి కృతజ్ఞత తెల్పుకొంటూ, తన ఇంటికి రమ్మని ప్రాధేయపడ్డాడు. సరేనన్నాడు, ఉదయనుడు.

వాళ్లు ఇల్లు చేరుకునేసరికి, ఆ వృద్ధుడు ఆ ఊరి రాజుగారి సేవకుడి తండ్రే అని తెలిసింది. తన తండ్రికి యిలా చూపు వచ్చేసరికి, ఆ సేవకుడు ఉప్పొంగిపోయాడు. ఇంకేముంది, ఈ సమాచారం ఊరంతా అల్లుకుని, రాజుగారి చెవిని పడింది.

రాజుగారు భటులను పంపి, ఉదయనుడిని తన వద్దకు తీసుకురమ్మన్నాడు. ఉదయనుడు, రాజు ఎదట హాజరయ్యాడు. ఉదయనుడిని, రాజు బహువిధాల సత్కరించి, "నీ వంటి ప్రజ్ఞావంతుణ్ణి, ఇంత వరకూ చూసి ఎరగను. నీవు మా ఆస్థానంలో వుండిపోవాలి," అని కోరాడు.

అందుకు ఉదయనుడు, "మహారాజా, మీరు చూపిన ఆదరమూ, అభిమానమూ మరవలేను. అయితే, యిప్పుడు నేనొక ముఖ్యమైన పని మీద వెళుతున్నాను. తిరుగుదలలో మళ్ళీ ఏలినవారి దర్శనం చేసుకొంటాను," అన్నాడు.

రాజు సంతోషించి ఉదయనుణ్ణి అతి వైభవంగా సాగనంపాడు. అటు తరవాత ఏవిధమైన అవాంతరాలూ లేకుండా, మరసటి వారానికల్లా ఉదయనుడు శ్రావస్తీనగరం చేరుకున్నాడు.

అతనిని చూస్తూనే రాజు ఎదురువచ్చి కౌగలించుకున్నాడు. రాజకుమార్తెలు క్షేమంగావున్నారని చెప్పాడు, ఉదయనుడు. రాజు కొంచెం స్థిమితపడ్డాడు. ఉదయనుడు, రాజుకు అప్పటి వరకు జరిగిన వింతలన్నీ పూసగుచ్చినట్టు చెప్పి, "మీరు నిశ్చింతగా వుండండి, మహారాజా! త్వరలోనే మేము, మీ అమ్మాయిలతోసహా క్షేమంగా తిరిగి వచ్చేస్తాము," అన్నాడు.

ఈ వార్త వినగానే రాజు హృదయం ఉప్పొంగింది. రాణిముఖం కలకల్లాడింది. రాజ్యంలో ప్రజలంతా ఆనందసాగరంలో మునిగిపోయారు.

మరునాడే ఉదయనుడు జాగుచేయక రాజు దగ్గిర సెలవు తీసుకుని, తల్లి ఆశీర్వాదం పొంది, బయలుదేరాడు.

మరొక్క వారానికల్లా ఉదయనుడు మాయాభవనం చేరుకున్నాడు. చేరుకున్నాడే కాని, ఆ క్షణమందు కంటబడ్డ విడ్డూరం ఉదయనుణ్ణి ఒడలు కంపింపజేసింది. అంతటి భయంకరమైన దృశ్యం ఏమైవుంటుంది!

తోటలో ఒక చెట్టుకు అయిదు ఉరితాళ్లు వేళ్లాడుతున్నై. సంధ్యా, నిశీధుడూ, గడ్డపువాడూ, శ్రావస్తి నుంచి వచ్చిన రాజభటులూ—అంతా ఒక వరసలో కూర్చునివున్నారు. వాళ్లందరకూ కాళ్లూ, చేతులూ కట్టి బిగింపబడి వున్నై. ఎదురుగా పులిలాగా రాక్షసుడు నిలబడి వున్నాడు. —(ఇంకా వుంది)





# నేత్రగండం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఈ ప్రపంచంలో ఎంత మహత్తర శక్తిమంతులైనా అనాదరణకు గురి అయ్యే అవకాశం ఉన్నది. అందుకు నిదర్శనంగా నీకు విష్ణుశాస్త్రి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం వంగదేశాన్ని చంద్రవర్మ అనే రాజు పాలించాడు. అతడు యువకుడైనా చాలా నిశితమైన బుద్ధికలవాడు; పరిపాలనలో చాలా సమర్థుడు. అయితే అతనికి జ్యోతిషమంటే తగని పిచ్చి. ఏ జ్యోతిష్కుడు వచ్చినా అతను తన జాతకం చెప్పించుకునేవాడు.

## బేతాళ కథలు



''అయితే, స్వామీ, అది తప్పే మార్గం లేదా ?'' అని రాజు అడిగాడు.

విష్ణుశాస్త్రి ఏదో గుణించి, కొంచెం సేపు ధ్యానించి, ''రాజా, ఒక చిన్న అవకాశం ఉన్నది. అయితే ఈ సంగతి ఎవరికీ చెప్పకండి. వికారాకారం గల ఒక మంత్రవేత్త మీరు పిలవకుండానే మీ ఆస్థానానికి రావచ్చు. అతని మంత్ర శక్తి చేత మీ నేత్రగండం తొలగిపోవచ్చు. అంతకు మించి ఏమీ చెప్పలేక పోతున్నాను,'' అన్నాడు.

రాజు విష్ణుశాస్త్రిని తగిన విధంగా సత్కరించి పంపేశాడు.

ఒకరోజు అతని ఆస్థానానికి విష్ణుశాస్త్రి అనే జ్యోతిష్కుడు వచ్చాడు. చంద్రవర్మ అతన్ని ఆదరించి, తన అలవాటు ప్రకారం ఆయనకు తన జాతకం చూపించాడు.

విష్ణుశాస్త్రి రాజు జాతకాన్ని పరిశీలించి, ''రాజా, నిజమైన జ్యోతిష్కుడికి మొహమాటం ఉండరాదంటారు. ఉన్న మాట చెప్పేస్తాను. సరిగా పద్దెనిమిదేళ్ళకు ఈ దేశంలో తీవ్ర క్షామం ఏర్పడుతుంది. అది ఒక సంవత్సరం మాత్రమే ఉంటుంది. కాని అది గడిచిన రెండేళ్లకు మీ కళ్ళు రెండూ పోయే ప్రమాదం ఉన్నది. ఇలా చెప్పినందుకు నాపై ఆగ్రహించకండి,'' అన్నాడు.

తరవాత పద్దెనిమిదేళ్ళకు, విష్ణుశాస్త్రి చెప్పినట్టే, దేశంలో విపరీతమైన కరువు ఏర్పడింది. అయితే రాజు ముందే తగిన జాగ్రత్తలు తీసుకుని ఉండటం వల్ల, ఆకలి చావులు లేకుండా ప్రజలు కరువు నుంచి బయటపడ్డారు. మరుసటి ఏడు మామూలుగా వర్షాలు పడి దేశం కోలుకున్నది. కరువు నుంచి తమను కాపాడటానికి రాజు చేసిన చర్యలను గురించి ప్రజలు గొప్పగా చెప్పుకున్నారు.

కాని రాజుకు మాత్రం దిగులు పట్టుకున్నది. పద్దెనిమిదేళ్లకు రాబోయే కరువు గురించి సరిగా చెప్పిన విష్ణుశాస్త్రి తనకు రానున్న నేత్రగండం గురించి కూడా సరి

గానే చెప్పి ఉంటాడు. అతను వికారాకారుడైన మంత్రవేత్త రాక కోసం ఎదురు చూడసాగాడు.

ఇంతలో చంద్రవర్మకు కళింగరాజు వద్ద నుంచీ, కాశ్మీరు రాజు వద్ద నుంచీ ఇంచు మించు ఒకే రకమైన వార్తలు అందాయి. వాళ్ళకు ప్రాణగండం ఉంటే, వికారాకారుడైన వరుణశాస్త్రి అనే మంత్రవేత్త ఒకడువచ్చి, హోమాలూ, జపాలూ చేసి, ఒక మంత్రపు కంకణం ఇచ్చివెళ్ళాడట. గండం గడువు దాటిపోయింది గాని ఎలాటి ప్రమాదమూ కలగలేదు.

కళింగరాజు ఇంకా ఇలా రాశాడు:

"వరుణశాస్త్రిని మా ఆస్థానంలోనే ఉండి పొమ్మని కోరాం. కాని అతను ఒప్పుకోలేదు. అంతే కాదు. ఆయన నివాసం ఏ దేశంలోనో కూడా చెప్ప నిరాకరించాడు. అయితే మా వేగుల వాళ్లను నియోగించి, అతనిది మీ దేశమేనని తెలుసుకున్నాం. అలాటి మంత్రవేత్తను వినియోగించి, మీకు రానున్న నేత్రగండాన్ని సులువుగా తప్పించుకోవచ్చు."

ఈ ఉత్తరాలు చూడగానే చంద్రవర్మ, "ఆ వరుణశాస్త్రి త్వరలోనే ఇక్కడికి వస్తాడు," అనుకున్నాడు.

అతని ఊహ నిజమయింది. వారం రోజుల కల్లా వరుణశాస్త్రి వచ్చాడు. అతనికి ఇరవైఅయిదు సంవత్సరాల వయసు ఉంటుంది. అతను లావుగా, నల్లగా, మెల్లకళ్లతో, వికారంగానే ఉన్నాడు.





చంద్రవర్మ అతనికి తగిన సత్కారాలు చేసి, తన జాతకం చూపించాడు. దాన్ని పరిశీలించి వరుణశాస్త్రి, "రాజా, సూర్యోపాసనా, కొన్ని జపాలూ చెయ్యవలసి ఉన్నది. ఎందుకంటే, మీకు త్వరలో నేత్రగండం ఉన్నది. కాని దాన్ని నేను తప్పించగలను. భయపడకండి," అన్నాడు.

చంద్రవర్మ వరుణశాస్త్రి కోరినదంతా కోరినట్టు జరిపించాడు. తతంగమంతా ముగిసినాక, వరుణశాస్త్రి చంద్రవర్మతో, "రాజా, ఇక మీరు నాకు ఇయ్యదలచినది ఇప్పించి, సెలవు ఇప్పించండి," అన్నాడు.

చంద్రవర్మ అతన్ని కబుర్లలో పెట్టి, "మీ తండ్రిగారు ఎవరు? ఆయన ఏం చేస్తూ ఉంటారు?" అని అడిగాడు.

"నా చిన్నతనంలోనే మా తండ్రిగారు పోయారు," అన్నాడు వరుణశాస్త్రి.

"అలాగా, పాపం? మీవంటి ప్రతిభావంతుణ్ణి కన్న అదృష్టవంతుడు ఏ లోకాన ఉన్నాడో. మీరు ఒక పని చేయండి. మీరు మీ నాన్నగారి తిథికి ముందుగా రండి. ఆయన తిథి వైభవంగా జరిపించి, మీకు కట్నాలూ, కానుకలూ ఇస్తాను," అన్నాడు చంద్రవర్మ.

వరుణశాస్త్రి వెంటనే, "మా నాన్నగారి తిథి ఎల్లుండే. అందుకే నేను ఇంటికి తొందరగా వెళ్ళాలి," అన్నాడు.

"అలా అయితే మీరు వెళ్ళిపోవలసిన పనే లేదు. ఇక్కడే తిథి వైభవంగా జరిపి, బ్రాహ్మణులకందరికీ సంతర్పణ చేద్దాం. ఎల్లుండి సాయంకాలమే మీ సన్మానం జరుగుతుంది. మీ వాళ్ళనందరినీ పిలిపిస్తాను," అన్నాడు చంద్రవర్మ.

వరుణశాస్త్రి ఎవరినీ పిలిపించలేదు గాని, చంద్రవర్మ తన మనుషులను పంపించి విష్ణుశాస్త్రిని పిలిపించి, ఆయనకు వరుణశాస్త్రిని పరిచయం చేస్తూ, "మీరు ఆనాడే చెప్పినట్టు నాకు నేత్రగండం తప్పించిన మంత్రవేత్త వీరే! ఈ రోజే



వీరి నాన్నగారి తిథి. భారీ ఎత్తున తిథి నిర్వర్తించి, బ్రాహ్మణ సంతర్పణ చేసి, వీరి తండ్రిగారి ఆత్మకు తృప్తి కలిగే టందుకు ఈ వరుణశాస్త్రిగారికి సత్కారం చేస్తున్నాను. ఈ సందర్భంలో మిమ్మల్ని కూడా గౌరవించటం సముచితంగా ఉంటుందనుకున్నాను,'' అన్నాడు.

విష్ణుశాస్త్రి ముఖంలో సంతోషం ఏ మాత్రమూ కనిపించలేదు. శ్రాద్ధం తంతు చాలావరకు పూర్తి అయి, పిండప్రదానం దాకా వచ్చింది. ఇంతలో విష్ణుశాస్త్రి, ''ఆపండి!'' అని కేక వేశాడు.

చంద్రవర్మ వెంటనే కార్యక్రమమంతా ఆపు చేయించి, ''ఈ వరుణశాస్త్రిని ఖైదులో ఒక నెల రోజులపాటు బంధించి ఉంచండి. ఈ విష్ణుశాస్త్రికి జ్యోతిషం చెప్పే హక్కు తీసివేస్తున్నాను. ఎవరూ ఈయన జ్యోతిషం నమ్మవద్దని దేశ మంతటా చాటింపు వెయ్యండి,'' అని ఆజ్ఞాపించాడు.

ఆ సాయంకాలం చంద్రవర్మ విష్ణు శాస్త్రికి నూరు వరహాలు ఇచ్చి పంపేశాడు. వెళ్ళిపోతూ విష్ణుశాస్త్రి చంద్రవర్మ కుశాగ్రబుద్ధినీ, దయార్ద్ర హృదయాన్నీ మెచ్చుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, విష్ణుశాస్త్రి శ్రాద్ధాన్ని ఎందుకు ఆపమన్నాడు? చంద్రవర్మ ఆయనను జ్యోతిష్కుడుగా బతకనివ్వకుండా ఎందుకు ఆంక్ష పెట్టాడు? మంత్రశక్తితో తనకు నేత్రగండం రాకుండా కాపాడిన వరుణ శాస్త్రిని నెల రోజుల పాటు ఎందుకు ఖైదులో ఉంచాడు? ఈ సందేహాలకు తెలిసి కూడా సమాధానాలు చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''వరుణశాస్త్రి విష్ణుశాస్త్రి కొడుకేనన్నది స్పష్టం. సూక్ష్మ బుద్ధిగల చంద్రవర్మ ఈ సంగతి పసిగట్టి, దాన్ని రుజువు చెయ్యటానికి తగిన ఎత్తు వేశాడు. ఆ ఎత్తు పారింది. అతను అలా

అనుమానించటానికి ముఖ్య కారణం కళింగ, కాశ్మీర రాజుల లేఖలు అయి ఉండాలి. తన నేత్రగండం గురించి వారికి వరుణశాస్త్రి చెప్పి ఉండాలి. వరుణశాస్త్రి అప్పటికింకా చంద్రవర్మను గాని, అతని జాతకాన్ని గాని చూడలేదు. అతనికి తన నేత్రగండం మాట విష్ణు శాస్త్రి చెప్పి ఉండాలి. వరుణశాస్త్రి చాలా అపచారాలు చేశాడు. తన తండ్రి పోయి నట్టు చెప్పాడు. ఆయనకు శ్రాద్ధం పెట్టాడు. మంత్రవేత్తగా నటిస్తూ అందరి గండాలూ పోగొట్టటానికి అతను భగవంతుడేమీ కాడు. నిజంగా గొప్ప శక్తులే కలవాడైతే అతను ఏ ఆస్థానం లోనూ ఉండ నిరాకరించడు. తనకు పేరు ప్రతిష్ఠలు లేని చంద్రవర్మ రాజ్యం లోనే ఉండగోరడు; తన దేశం ఏదో కూడా దాచిపెట్టడు. అతను శిక్షార్హుడు. ఇక విష్ణుశాస్త్రి మంచి జ్యోతిష్కుడు కాదనటానికి లేదు. ఎప్పుడో రాబోయే కరువునూ, దాని పరిమితినీ చాలా బాగా చెప్పాడు. కాని తన జ్యోతిషం అడ్డం పెట్టుకుని ఆయన తన పనికిమాలిన కొడుక్కు, వాడింకా పసివాడుగా ఉండ గానే, ఉపాధి కలిగించటానికి ఎక్క డెక్కడి దూర దేశాలకో వెళ్ళి, అక్కడి రాజులకు లేని గండాలు చెప్పి, తన కొడుకును పంపాడు. అందుచేత ఆయన జ్యోతిష్కుడుగా జీవించే హక్కును కోల్పోయాడు. అయినా ఆయనకున్న నిజమైన ప్రతిభను మెచ్చి, చంద్రవర్మ ఆయనకు చిన్న సత్కారం చేశాడు. విష్ణుశాస్త్రి రాజును రహస్యం తెలుసు కున్నందుకూ, తాను నేరం చేసినా తన పట్ల సానుభూతి చూపినందుకూ మెచ్చు కున్నాడు. తన కొడుకు శిక్ష కూడా అతను చేసిన నేరానికి చాలా తక్కువే అని ఆయన గ్రహించి ఉండవచ్చు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# నేరనిర్ణయం

విశాలదేశాన్ని ఏలే శతానన మహారాజు తన దేశంలో న్యాయవిచారణలో సంపూర్ణమైన న్యాయం జరగాలన్న ఆశయం కలవాడు. ఈ మాట ఆయన తన మంత్రి అయిన బృహన్మతితో అంటే, అది అసాధ్యమని బృహన్మతి ఆయనకు స్పష్టం చేసేశాడు.

ఆ కాలంలో రఘునాథు డనే గొప్ప శాస్త్రవేత్త ఒకడు ఉండేవాడు. ఆయన గొప్ప గొప్ప ప్రయోగాలు చేసి, తాను ఏదైనా అపూర్వమైన వస్తువును తయారు చేసినప్పుడు, దాన్ని తీసుకుని వేరు వేరు దేశాల రాజులకు చూపించి, "దీనివల్ల మీకేమైనా ప్రయోజనం ఉంటుందేమో చూడండి," అని, ఆ వస్తువును ఎలా ఉపయోగించాలో చూపేవాడు.

ఈ రఘునాధుడికి కూడా శతానన మహారాజు తన ఆశయం గురించి ఒకప్పుడు చెప్పి, ఏదైనా అపూర్వవస్తువు తయారు చేస్తే తనకు చూపమన్నాడు.

ఒకసారి ఆ రఘునాధుడు విశాలదేశానికి వచ్చి, శతాననుణ్ణి కలుసుకుని, ఒక పెట్టె ఇచ్చాడు. ఆ పెట్టెలో ఒక చిన్న యంత్రం ఉన్నది. ఆ యంత్రం గురించి రఘునాధుడు శతాననమహారాజుతో ఇలా చెప్పాడు:

"చాలాకాలం క్రితం మీరు నాతో నిర్దుష్టమైన న్యాయనిర్ణయం జరిగే మార్గం గురించి అడిగారు. నేను చాలా ప్రయోగాలుచేసి ఈ యంత్రాన్ని తయారు చేశాను. ఇది మనిషి శరీరంలోని కంపనల ఆధారంతో పనిచేస్తుంది. చూడండి. ఇందులో ఒక ముల్లు ఉన్నది. సున్నా నుంచి పది దాకా అంకెలు ఉన్నాయి. ఎవరన్నా దీనిని ధరించి మాట్లాడేటప్పుడు ఈ ముల్లు నాలుగు అంకె దాటి వెళ్లదు.

"వసుంధర"



అలా వెళ్ళిన పక్షంలో ఆ మనిషి అబద్ధమాడుతున్నాడన్న మాట. దీని సహాయంతో న్యాయాధికారి, దోషిగా ఎంచబడిన వాడు నిజం చెబుతున్నాడో, అబద్ధమే చెబుతున్నాడో తేలికగా నిర్ణయించవచ్చు.''

ఈ మాట విని మంత్రి అయిన బృహన్మతి, ''ఆర్యా, నేరం మనస్తత్వానికి సంబంధించినది. ఈ యంత్రం కేవలమూ భౌతికశరీరంలో కలిగే మార్పులను మాత్రమే కొలుస్తుంది. అందుచేత దీని సహాయంతో నిర్దుష్టంగా నేరనిర్ణయం సాధ్యపడదేమోనని నా అనుమానం,'' అన్నాడు.

రఘునాథుడు చిరునవ్వు నవ్వి. ''మనస్సు శరీరంలో కలిగించే అతి సూక్ష్మ శరీర కంపనలను సైతం ఈ యంత్రం కనిపెట్టగలదు. నేరం మనస్సుకు సంబంధించినదే అయినా, నేరస్థుడి మనస్సుకు అనుగుణంగా అతని శరీరంలో కంపనలు కలుగుతాయి. అందుచేత, నిర్దుష్టమైన నేర నిర్ణయానికి ఈ యంత్రంపై పూర్తిగా ఆధారపడవచ్చును. కావాలంటే మీరు ఈ యంత్రాన్ని పరీక్షించి చూడండి.'' అన్నాడు.

వెంటనే రాజూ, మంత్రీ కూడా యంత్రాన్ని పరీక్షించి చూశారు. రాజు అబద్ధమాడగానే ముల్లు ఏడు అంకె మీదికి పోయింది; మంత్రి అబద్ధ మాడినప్పుడు అయిదు అంకె మీదికి పోయింది.

''అద్భుతం!'' అన్నాడు రాజు.

మంత్రి మాత్రం, ''రాజుగారికి ఏడు అంకె చూపించిన ముల్లు, నాకు అయిదు అంకె మాత్రమే చూపించింది. మరొకరికి రెండు అంకెమాత్రం చూపదని ఏమిటి?'' అన్నాడు.

రఘునాథుడు చిరాకుపడి, ''ఈ యంత్రం గురించి నాకు ఎలాటి సందేహమూ లేదు. కావాలంటే మీరు ఎన్ని పరీక్షలైనా చేసుకోవచ్చును.'' అన్నాడు.

రాజు తన మంత్రిని మందలించి, రఘునాధుణ్ణి శాంతపరచి, ''నాకు ఈ యంత్రం పైన పూర్తి విశ్వాసం కుదిరింది. దీని ధర్మాన ఇక ముందు నా రాజ్యంలో నిర్దోషులకు ఎలాటి భయమూ ఉండదు. న్యాయ నిర్ణయం కూడా కాలయాపన లేకుండా జరిగిపోతుంది,'' అన్నాడు.

రఘునాధుడు సన్మానాలు పొంది వెళ్లి పోయాక, రాజు ఆ యంత్రాన్ని ఎన్నో పరీక్షలకు పెట్టాడు. అది నమ్మదగినదే నని రుజువయింది. త్వరలోనే రాజు నేర విచారణ జరిపినప్పుడల్లా పూర్తిగా ఆ యంత్రం మీదనే ఆధారపడసాగాడు. పూర్తిగా ఆ యంత్రం మీదనే ఆధార పడటం అంత మంచిది కాదని మంత్రి హెచ్చరించినా కూడా రాజు వినిపించు కోలేదు.

ఇలా ఉండగా, ఒక గ్రామంలో సిద్ధయ్య అనే ఒక రైతు, మిట్టమధ్యాన్నం వేళ, నలుగురూ నడిచే రాచబాటలో, నారయ్య అనే వ్యాపారిని దారుణంగా హత్యచేశాడు. వెంటనే పదిమందీ చేరి సిద్ధయ్యను పట్టుకుని న్యాయస్థానానికి తీసుకు వచ్చారు. సిద్ధయ్య ఒకంతట న్యాయస్థానానికి రావటానికి ఒప్పుకోక, పెనుగులాడుతూ, తాను ఏమీ నేరం చెయ్యలేదని చెప్పాడు.

సిద్ధయ్యను తెచ్చి రాజు ఎదట నిల బెట్టగానే, రాజాజ్ఞ ప్రకారం ఇద్దరు భటులు సిద్ధయ్య రెండు చేతులూ పట్టు



కున్నారు. మూడో భటుడు సిద్ధయ్య మెడలో యంత్రం తగిలించాడు.

"నువు నేరం చేశావా, లేదా?" అని రాజు సిద్ధయ్యను అడిగాడు.

"లేదు," అన్నాడు సిద్ధయ్య. భటుడు యంత్రంలోని ముల్లు కేసి చూసి, అది ఒకటి అంకె మీద ఉన్నట్టు చెప్పాడు.

"అతన్ని విడిచి పెట్టండి," అన్నాడు మహారాజు.

అతను హత్య చెయ్యటం కళ్లారాచూసిన గ్రామస్థులంతా హాహాకారాలు చేశారు.

ఈ సంగతి తెలుసుకుని రాజు సిద్ధయ్యను మళ్ళీ, మళ్ళీ అదే ప్రశ్న వేశాడు. కాని ముల్లు ఒకటి మీదనే ఉండిపోయింది.

ఇదంతా చూసి బృహన్మతి ఒకక్షణం ఆలోచించి, "నువు హత్యచేశావా, లేదా?" అని సిద్ధయ్యను అడిగాడు.

"చేశాను," అన్నాడు సిద్ధయ్య.

రాజు ఆశ్చర్యానికి మేరలేదు. సిద్ధయ్య హత్యచేశాడు, కాని నేరం చెయ్యలేదని యంత్రం చెబుతున్నది! రెండూ నిజమెలా అవుతాయి?

"హత్య చేస్తే నువు నేరం చేసినట్టే కదా?" అని రాజు సిద్ధయ్యను అడిగాడు.

"వాడు నా పెళ్ళాం బిడ్డల్ని హత్య చేసిన సంగతి నా కొక్కడికే తెలుసు. అందుకే వాణ్ణి నేను చంపాను. అది నేరం ఎందుకవుతుంది?" అని సిద్ధయ్య రాజుతో అన్నాడు.

బృహన్మతి రాజు కేసి చూసి నవ్వి, "యంత్రం అసత్య మాడలేదు. తాను చేసిన హత్య నేరం కాదని సిద్ధయ్య నమ్ముతున్నాడు. అందుచేత యంత్రం అతను నేరం చెయ్యలేదని చెప్పింది. అతను శిక్షార్హుడో, కాదో, చెప్పవలిసింది శిక్షాస్మృతి. ఈ యంత్రం కాదు," అన్నాడు.

రాజుకు తన పొరపాటు తెలిసివచ్చింది. యంత్రానికున్న హద్దులు గ్రహించి, ఆయన సిద్ధయ్యకు తగిన శిక్ష ఇచ్చి, ఆటుతరవాత పూర్తిగా యంత్రం ఆధారంతో తీర్పులు చెప్పటం మానుకున్నాడు.





అశోకపురం సంపన్నమైన గ్రామం. అక్కడ వరిపొలాలూ, పళ్లతోటలూ, చెరువులూ, ఉద్యానాలూ ఉండేవి. గ్రామస్థులు కష్టపడి కృషి చేసి, కడుపు నిండా తింటూ సుఖంగా జీవించేవారు.

యదుపతి అనే పెద్ద భూస్వామి గ్రామాధికారిగా ఉండేవాడు. ఆయన కొడుకు రూపలాల్ అనేవాడు తెలివిగలవాడూ, చలాకీ అయినవాడూనూ.

దీపావళి రోజులలో ఏటా ఆ గ్రామంలో నెల రోజులపాటు సంత జరిగేది. చుట్టుపక్కల నుంచి వర్తకులూ, వినోదకులూ, ప్రేక్షకులూ వచ్చేవాళ్ళు.

ఆ యేడు పంటలు బాగా ఉండటాన సంత మరింత ఉత్సాహంగా జరిగింది. దాన్ని నిర్వహించే భారం రూపలాల్ పైన పడింది. అతను కూడా తన పనిని సమర్థతతో నిర్వహించాడు.

సంత నడుస్తూండగా కొందరు ఆటవికులు అక్కడికి వచ్చి, మజిలీ ఏర్పాటు చేసుకోవాలని చూశారు. ఈ సంగతి తెలిసి రూపలాల్ అక్కడికి వెళ్ళాడు.

"మీకిక్కడ ఏం పని?" అని అతను ఆటవికుల పెద్దను అడిగాడు.

"మేం మూలికలూ, మందులూ అమ్ముకోవటానికి వచ్చాం," అన్నాడు ఆటవికుల పెద్ద.

వాళ్ళు దొంగలనీ, మోసగాళ్ళనీ రూపలాల్‌కు తెలుసు. అయితే వాళ్ళకు మంత్ర విద్యలు వచ్చుననీ, చేతబడులూ, ప్రయోగాలూ చేస్తారనీ భయపడి, అతను వాళ్ళను గుడిసెలు వేసుకోనిచ్చాడు. వాళ్ళకు భూత ప్రేత పిశాచాలు అధీనమై ఉంటాయనీ, ఇష్టంలేని వాళ్ళ మీదికి వాళ్ళు వాటిని పంపకం చేస్తారనీ అందరూ నమ్మినట్టే అతనూ నమ్మాడు.

---



---



ఆటవికులు గ్రామంలోకి అడుగు పెట్టిన రెండు రోజుల లోపల రెండు పెద్ద దొంగతనాలు జరిగాయి. ఒక నగల వ్యాపారి ఇంట్లోనూ, ఒక వర్తకుడి ఇంట్లోనూ దొంగలు పడి దోచుకున్నారు. ఆటవికుల గుడిసెల్లో వెతకగా పోయిన నగలలో ఒకటి దొరికింది. ఆటవికులను లెక్క పెట్టగా, పది పన్నెండు మంది లేనట్టు బయటపడింది.

ఆటవికుల పెద్దను పట్టుకుని కొట్టినా, తన వాళ్ళు దొంగతనం చేసినట్టు ఒప్పుకోలేదు. గత్యంతరంలేక, రూపలాల్ ఆటవికులనందరినీ వెళ్ళగొట్టి, చోరీ గురించి పోలీసులకు తెలియబరిచాడు.

వెళ్ళిపోయేటప్పుడు ఆటవికుల పెద్ద రూపలాల్‌ను బెదిరిస్తూ, "నిన్ను ఇంతటితో వదిలాననుకోకు. మా శక్తి నీకు తెలుసుగా? నీ మీద దయ్యాన్ని పంపకం చేస్తాను. బతికున్నంత కాలమూ అది నిన్ను పీక్కుతింటుంది, చూస్తూండు!" అన్నాడు.

ఆటవికులు వెళ్ళిపోయే లోపల పోలీసులు వచ్చి వాళ్ళను పట్టుకున్నారు.

రూపలాల్ ధైర్యం గలవాడే గాని, అతని మూఢ విశ్వాసం అతని మనసులో పురుగులాగా చేరి తొలవసాగింది. తనను ఏదో దయ్యం ఆవహించిందన్న భయం అతన్ని వెంటాడసాగింది. త్వరలోనే అతని మనసు బరువెక్కిపోయింది. రాత్రి పూట సరిగా నిద్ర పట్టేదికాదు. కళ్ళు మూసుకుంటే పీడకలలు రాసాగాయి. అతను తీవ్రమైన ఆరాటానికి గురి అయ్యాడు.

ఇంతలో సంత ముగిసింది. ఇప్పుడు రూపలాల్‌కు చేతి నిండా పని కూడా లేదు. అందుచేత చీటికీ మాటికీ ఆటవికుల పెద్ద అన్న మాటలూ, దయ్యం గురించిన ఆలోచనలూ అతని మనస్సులో మెదిలాయి. అతను తన గది దాటి బయటికి రావటం మానేసి, విచిత్రమైన మనోవ్యాధికి గురి అయాడు. అతనిలో

ఉన్మాద లక్షణాలు కూడా కనిపించాయి.

" అదుగో, అదుగో దయ్యం! ఆ మామిడి కొమ్మ మీద కూర్చున్నది," అంటూ పిచ్చి మాటలు ప్రారంభించాడు.

ఆటవికులు రూపలాల్ మీద నిజంగానే చేతబడి చేసి, ఏదో దయ్యాన్ని పంపకం చేశారన్న నమ్మకం గ్రామంలో అందరికీ కలిగింది. అందరికీ బెదురు పట్టుకున్నది. చీకటి పడ్డాక జనం బయటికి రావటానికి భయపడ్డారు. గ్రామ జీవితం అస్తవ్యస్తమయింది.

పోలీసులు పట్టుకుపోయిన, ఆటవికులను గురించి గ్రామస్థులకు ఏమీ తెలియరాలేదు. నేరం రుజువు చెయ్యలేక వాళ్లను వదిలేశారు.

పట్నంలో రూపలాల్ చదువుకున్న రోజుల్లో అతనికి అక్కడ సోమనాధుడు అనే మంచి స్నేహితుడు ఒకడు ఉండేవాడు. అతనికి ఇంద్రజాలం లాంటి విద్యలలో మంచి ప్రవేశం ఉన్నది. రూపలాల్ పరిస్థితి అలా అలా వెళ్ళి, సోమనాధుడి చెవిన పడింది.

రూపలాల్‌కు పట్టుకున్న వ్యాధి గురించి ఏమైనా చెయ్యాలని నిశ్చయించుకుని సోమనాధుడు మానసిక వ్యాధులకు చికిత్సచేసే ఒక మిత్రుణ్ణి సంప్రదించాడు.

" ఆటవికుల పెద్ద తన మీద ఏదో ప్రయోగం చేశాడని కద నీ స్నేహితుడి నమ్మకం? నీ దగ్గిర అంతకన్నా శక్తులున్నాయని అతన్ని నమ్మించి, నీ ఇంద్ర





జాలంతో దయ్యాన్ని పారదోలినట్టు అతనికి రుజువు చూపినట్టయితే అతను కోలుకుంటాడు," అన్నాడు అతని మిత్రుడు.

సోమనాథుడు తాను చేయవలసిన దాన్ని గురించి రెండు రోజుల పాటు దీర్ఘంగా ఆలోచించాడు; ఎన్నో పుస్తకాలు తిరగేసి, చివరకు ఒక పథకం నిర్ణయించాడు. తరవాత ఒక మధ్యాహ్నం అతను అశోకపురం వచ్చి, తన మిత్రుణ్ణి చూశాడు.

రూపలాల్ చిక్కి శల్యమై ఉన్నాడు. అతనిలో ఆరాటమూ, నిస్త్రాణా కానవచ్చాయి.

సోమనాథుణ్ణి చూసి రూపలాల్ కళాహీనంగా నవ్వి, "మిత్రమా, ఈ దిక్కుమాలిన దయ్యం నన్ను పీల్చి పిప్పి చేసేస్తున్నది. నేనింక ఎంతో కాలం బతకను," అన్నాడు. అతను నిట్టూర్చి ఏదో ఆలోచనలో మునిగిపోయి, అంతలోనే కెవ్వున అరిచి, "అదుగో, అదుగో! ఆ కొమ్మ మీద........" అన్నాడు.

సోమనాథుడు చెట్టు కొమ్మకేసి చూసి, కళ్ళు పెద్దవిచేసి, నిర్ఘాంతపోయినవాడిలా ముఖం పెట్టి, "అవును, ఆ వెధవ దయ్యం కనిపిస్తూనే ఉన్నది!" అన్నాడు.

అక్కడ ఉన్న వాళ్ళకు ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే వాళ్ళకు కొమ్మ మీద ఆకులు తప్ప ఇంకేమీ కనిపించటం లేదు.

"అది ఎంత భయంకరంగా ఉందో చూశావా, సోమనాథ్?" అన్నాడు రూపలాల్.

"అంతకన్నా భయంకరమైన దయ్యం ఉండదనుకుంటాను. నేను భూతవైద్యం చేసేటప్పుడు చాలా రకాల భూతాలనూ, దయ్యాలనూ చూస్తాను గదా! కాని ఇంత భయంకరమైన దయ్యాన్ని ఎన్నడూ నేను చూసివుండలేదు," అన్నాడు సోమనాథుడు.



"ఆ ఆటవికుల పెద్ద దాన్ని నా మీదికి పంపకం చేశాడు, తెలుసా?" అని రూప లాల్ అడిగాడు.

"అవును, అలాగే విన్నాను. కాని, ఒరే బాబూ, నేను ఆ ఆటవికుడి కన్నా తక్కువ వాణ్ణి అనుకోకు. వాడికి డొక్క శుద్ధి లేదు. వాడికి నా లాగా అథర్వ వేదమూ, తంత్ర శాస్త్రమూ, ఉపని షత్తులూ తెలుసునా ఏమన్నానా? అథర్వ వేదంలో దయ్యాలను వశీకరణ చేసు కునే అద్భుతమైన మంత్రం ఉన్నది. నేను దాన్ని అథర్వవేదం నుంచీ బృహ దారణ్యకోపనిషత్తు నుంచీ ఎత్తి రాసు కున్నాను, చూడు!" అంటూ సోమ నాథుడు తన సంచీ నుంచి ఒక కాగితం మడత పైకి తీసి చూపాడు. అందులో దేవనాగరలిపిలో ఏదో రాసి ఉన్నది.

అది చూసి రూపలాల్ ముఖం క్షణం పాటు వికసించినట్టు కనపడి మళ్లీ విచారం పులుముకున్నది.

సోమనాథుడు అతనితో, "ఇవాళ శని వారం. దయ్యాలను ఉచ్చాటన చెయ్య టానికి దివ్యమైన రోజు. ఈ సాయంకాలం ఆ దయ్యం అంతు చూడబోతున్నాను. ఇక దాని ఆట కట్టే!" అన్నాడు.

సాయంకాలం కావొస్తున్నది. సోమ నాథుడు చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు. యదుపతి ఇంటి ముందు ఆవరణ అంతా కళ్లాపి చల్లి శుభ్రం చేశారు. నాముతో చుట్టూ ఒక వలయం పెట్టారు. ఆవరణ నడిమధ్యలో ఒక ఇత్తడి బిందె, నీళ్ళు నింపి, అందులో మామిడి మండలు పెట్టినది, ఉంచారు. రూపలాల్‌ను స్నానం చేయించి, కొత్త పంచె కట్టి, ఒక తివాసీ మీద, బిందెకు సమీపంగా కూర్చోబెట్టారు. అతనికి దగ్గిరగా ఒక ఎత్తు పీట ఉంచారు. ఆవరణ నాలుగు మూలలా వెలుగు కోసం నాలుగు పెద్ద తైల దీపాలు పెట్టారు. గుగ్గిలం ధూపం వేసి, పొగ చుట్టూ అలుముకునేటట్టు చేశారు.



చీకటి పడుతూండగా సోమనాధుడు రూపలాల్ సమీపంలో కూర్చుని, సంస్కృతంలో మంత్రాలు చదవనారంభించాడు. ఉన్నట్టుండి అతను మామిడి చెట్టు కొమ్మ కేసి చూపుతూ, "అదుగో! అదుగో!" అన్నాడు. రూపలాల్ కళ్ళు పెద్దవి చేసి, భయంగా మామిడికొమ్మ కేసి చూశాడు.

సోమనాధుడు పట్నం నుంచి, తనకు సహాయంగా, ఒక మనిషిని తెచ్చుకున్నాడు. అతని కోరిక పైన ఆ మనిషికి వేరే గది ఏర్పాటు చేశారు. ఆ గదిలో ఆ మనిషి కుంపటి వెలిగించి, సోమనాధుడికి టీ తయారు చేశాడు. సోమనాధుడు వెళ్ళి టీ తాగి వచ్చి, తంతు కొనసాగించాడు.

అతను మరో అయిదు నిమిషాల పాటు మంత్రాలు చదివిన మీదట మామిడి కొమ్మలు గలగలలాడసాగాయి. ఉన్నట్టుండి ఒక కొమ్మ పెళపెళా విరిగి కింద పడింది.

"అదుగో! దయ్యం దిగి వచ్చింది," అని సోమనాధుడు తన మనిషిని సీసా, సాసరూ తెమ్మని కేక పెట్టాడు. ఆ మనిషి ముందు ఒక సాసర్ తెచ్చాడు. అది టీ కప్పు కింద ఉంచే మామూలు సాసరే. సోమనాధుడు దాన్ని గుడ్డతో శుభ్రం చేసి, "ఇప్పుడు సీసా పట్టుకురా. గుడ్డతో పట్టుకో. సీసాను వేళ్ళతో తాకకు!" అని కేక పెట్టాడు.

అతని మనిషి సీసాను గుడ్డతో పట్టుకుని తెచ్చాడు. సోమనాధుడు దాన్ని గుడ్డతోనే అందుకుని, దాని మూతిని గుడ్డతో శుభ్రంగా తుడిచి, బల్ల మీద పెట్టాడు.

తరవాత అతను, "ఆ పాపిష్టి దయ్యాన్ని ఎలా పట్టేస్తానో చూడు, రూపలాల్!" అని చెప్పి, కింద పడిన కొమ్మ కేసి చూస్తూ, "అయ్యా, దయ్యం గారూ, దయచేసి రండి! వచ్చి ఈ సీసా లోపల ప్రవేశించండి! వెంటనే రాకపోతే

మంత్రాలతో మారణ హోమం చెయ్య గలను. అందుచేత మంచిగా వచ్చెయ్యి!'' అని కుడి చేత్తో పిలుస్తూ, చప్పున సీసా మూతి మీద సాసరు పెట్టి, "మిత్రమా, రూపలాల్, దయ్యాన్ని పట్టేశాను!'' అన్నాడు.

అతను మరి కొంత సేపు మంత్రాలు చదివి, "అన్నట్టు, దయ్యం సీసాలోకి ఎక్కినట్టు నీ కింకా రుజువు చెయ్యలేదు కదూ? ఇదుగో చూడు. దయ్యం సీసా లోకి పోయింది గాదూ, అందుచేత సాసర్ సీసాకు కరుచుకుపోయింది. సాసర్ పట్టుకుని ఎత్తితే సీసా కూడా పైకి లేస్తుంది. చూడు!'' అన్నాడు రూప లాల్‌తో.

అతను సాసర్ పట్టుకుని పైకి ఎత్తే సరికి, సీసా కూడా దానితో పాటు పైకి లేచింది.

"దయ్యం కట్టుబడింది! పట్టు బడింది!'' అని అరుస్తూ రూపలాల్ మూర్ఛపోయాడు. సోమనాధుడు వెంటనే అతని ముఖాన నీళ్ళు చల్లి, విసిరాడు. కొద్దిసేపట్లో రూపలాల్ స్పృహ తెలిసి, మామూలు మనిషి అయిపోయాడు.

సోమనాధుడు సీసాను తన గదికి తీసుకుపోయి, దానికి బిరడా పెట్టి, మర్నాడు దాన్ని తీసుకుపోయి, అందరూ చూస్తూండగా నదిలో పారేశాడు.

సోమనాధుడు వాస్తవంగా చేసినది ఏమిటి? అతని మనిషి సీసాను కుంపటి మీద బాగా వేడెక్కించి తెచ్చాడు. అందుకే అతను దాన్ని గుడ్డతో పట్టి తెచ్చినది. వేడి సీసాలో గాలి వేడెక్కి విస్తరించుతుంది. బయటికి తెచ్చి, దాని మీద సాసర్ మూత పెట్టినప్పుడు సీసా లోని గాలి మళ్ళీ సంకోచం పొంది, సీసా లోని గాలి ఒత్తిడి కన్నా బయటి గాలి ఒత్తిడి ఎక్కువవుతుంది. ఆ కారణంగా సాసర్ సీసామూతిని బలంగా కరుచుకు పోయింది.

ఇక, మామిడి కొమ్మ విరచటానికి ఇనపతీగ ఉపయోగపడింది.



# 163. అద్భుతమైన మాయా శిల్పం

రోమన్ సామ్రాజ్యం శిథిలమై, యూరపు అంధకారయుగంలో ఉన్న సమయంలో, అజ్ఞాతంగా ఉండిన అమెరికాఖండంలో మాయాజాతిశిల్పుల ప్రతిభ పరాకాష్ఠ నందుకున్నది. ఈ బొమ్మలో ఉండే శిల్పం గ్వాటిమాల లోని పియెడ్రాస్నిగ్రాస్ గోపురదేవాలయం తాలూకు గుమ్మం మీది శిలలో మలిచిన చెక్కడం.

ఈ దృశ్యంలో అర్చకుడో, లేక జాతినాయకుడో, తన కింది వారితో ముచ్చటించటం చిత్రించ బడి ఉన్నది. వ్యక్తుల అంగప్రమాణాలు ఎంత నిర్దుష్టంగా ఉన్నవంటే ఆ బొమ్మలు యథార్థ వ్యక్తులనే చూపినట్టు కనబడుతుంది.

ఈ శిల్పంలో కొంత భాగం అర్ధ విగ్రహమూ, కొన్ని భాగాలు నిండు విగ్రహమూనూ. ఇది మాయా శిల్పానికి గల ప్రత్యేకతకు మంచి ఉదాహరణ. నాయకుడి చేతులూ, ఇతర వ్యక్తుల శిరస్సులూ సంపూర్ణ శిల్పాలు. మిగిలినదంతా పాక్షిక శిల్పం.

దృశ్యం చుట్టూ 158 సంకేతాక్షరీలున్నాయి. నిపుణులు వాటిలో ఆరు కాలసంకేతాలను గుర్తించి, ఈ శిల్పం క్రీ. శ. 761 లో తయారయినట్టు నిర్ణయించారు.

ఈ ప్రాంతం 1895 లో మొదట కనుగొనబడింది. 1930 లో ఇక్కడ విస్తృతంగా తవ్వకాలు జరిగాయి.





పూర్వం ఒక గ్రామంలో ఒక గొప్ప సంగీత విద్వాంసుడు ఉండే వాడు. ప్రతి రోజూ ఉదయం వేళ అయన తన ఇంటి అరుగు మీద కూర్చుని వీణ మీద సంగీత సాధన చేస్తూంటే, దారిన పోయే వాళ్ళు అక్కడే ఆగిపోయి, "అబ్బ, ఎంత గొప్ప సంగీతం! ఎంతటి విద్వాంసుడు!" అంటూ మెచ్చుకునే వారు.

అయితే ఈ విద్వాంసుడికి అతని సంగీతం ద్వారా పొగడ్తలు తప్ప ఇంకేమీ ముట్టలేదు. అయనకు సరిగా కడుపుకు తినటానికి కూడా లేదు. తన సంగీతం విని ఆనందించే వాళ్ళు తనకు తృణమో, పణమో ముట్టజెప్పరాదా అనుకునేవాడు అయన. కాని ఆ పని చేసిన వారు లేరు.

సంగీత విద్వాంసుడి ఇంటి సమీపంలోనే ఒక ధనికుడు ఉండే వాడు. అయన తనకు తీరుబడిగా ఉన్నప్పుడల్లా సంగీత విద్వాంసుడి వద్దకు వచ్చి, తనకు ఇష్టమైన పాటలు వాయించమని కోరేవాడు. అయన అలా కోరినందుకే ఉబ్బిపోయి, విద్వాంసుడు మహోత్సాహంతో అద్భుతంగా వాయించి వినిపించేవాడు. అంత ఆసక్తితో విన్న పెద్దమనిషి తనకు పాలో, కూరగాయలో ఎందుకు ఇయ్యగూడదని విద్వాంసుడికి అనిపించేది; కాని నోరు తెరిచి అడగటానికి బిడియం వేసేది.

ఒకనాడు విద్వాంసుడి భార్య, "అందరూ మీ విద్యను పొగడుతున్నా కూడా మనకు ఈ బీదతనం తప్పటం లేదు. మరీ ఆ ధనికుడు వచ్చాడంటే గంటల తరబడి మీ సంగీతం వింటూ కూర్చుని ఏ పనీ చేసుకోనియ్యడు. నా మాట విని, అతన్ని ఏమన్నా ఇయ్యమని అడగండి. దాంతో అతను ఇక్కడికి

పి. నరసింహారావు



రావటమన్నా మానేస్తాడు. మీరు ఇంకేదన్నా పని చూసుకోవచ్చు,'' అన్నది భర్తతో.

''నిజమే! విద్యను అమ్ముకోవటం నాకు ఇష్టంలేక పోయినా, ఇక అలా చేయకతప్పదు. లేకపోతే మనం ఆకలితో మాడి చచ్చిపోతాం. అయితే, సంగీత సాధనలో పడితే నాకు ఈ సంగతి గుర్తు రాదు. అందుచేత నువు కాస్త జ్ఞాపకం చెయ్యి,'' అన్నాడు భర్త.

మర్నాటి నుంచీ సంగీత విద్వాంసుడు తన ఇంటి మీద పడి, సంగీతం వినిపించమని వేధించిన వారందరి దగ్గిర నుంచీ ఎంతో కొంత డబ్బు వసూలు చెయ్యసాగాడు. అంతటితో సంగీతం వినటానికి అక్కడికి వచ్చే వారి సంఖ్య చాలా తగ్గిపోయింది.

ధనికుడికి మాత్రం చాలా కోపం వచ్చింది. ఆయన సంగీత విద్వాంసుడితో, ''మీ నోట ఇలాటి మాట వింటానని కలలో కూడా అనుకోలేదు. ఎంత అప్రతిష్ఠ! మీ అంతటి మహా విద్వాంసుడు విద్యను బజారు వస్తువులాగా అమ్మటమా? ఛీ, ఛీ! మీ సంగీతం మా కన్న మీకే ఎక్కువ ఆనందం ఇయ్యాలి. మీలాటి విద్వాంసులకు ద్రవ్యాశ ఉండదనీ, విద్యే మీకు సర్వస్వమనీ అనుకున్నాను,'' అన్నాడు.

దానికి విద్వాంసుడు, ''అయ్యా, మీరు చెప్పేదంతా బాగానే ఉంది. నా సంగీతం ద్వారా ఇతరులను ఆనందింప జేయడం కన్న నాకు ఇంకేమీలేదు. అయినా కొంచెం ఆలోచించండి. నేను రోజూ భోజనం చెయ్యాలి. నా భార్య నాకు వండి పెట్టాలి. అందుకు కొన్ని వస్తువులు కొనాలి. కొనటానికి నా దగ్గిర డబ్బులేదు. తిండి లేకపోతే నేను చచ్చిపోతాను. నేను పోతే నా విద్య పోతుంది గదా!'' అన్నాడు.

''సరే. మీ యిష్టం! నేను మాత్రం చిల్లిగవ్వ ఇయ్యను. మీ సంగీతం వినక

పోతే నేనేమీ చావను లెండి!'' అంటూ ధనికుడు వెళ్ళిపోయాడు.

ఆయన రావటం మానేశాడని విద్వాంసుడి భార్య, ''శని విరగడ అయిపోయింది!'' అని సంతోషించింది.

కాని ఒకరోజు ఉదయమే ఆ ధనికుడు మళ్ళీ ప్రత్యక్షమై, ''మహాశయా, నా కిష్టమైన పాట ఒక్కసారి వినిపింతురూ! కలలో కూడా అదే వినపడుతున్నది. ఉండబట్టలేక వచ్చేశాను,'' అన్నాడు.

తన సంగీతం కోసం ధనికుడు అంతగా తహతహలాడుతున్నందుకు ఉబ్బిపోయి విద్వాంసుడు తన వీణను పైకి తీశాడు. అంతలోనే ఆయన కేసి భార్య హెచ్చరికగా చూసేసరికి, తన ఉత్సాహాన్ని అదుపులోకి తెచ్చుకుని, ''ముందే విన్నవించుకున్నాను గదా? నా సంగీతం విని ఏమిస్తారో చెప్పండి,'' అన్నాడాయన.

ధనికుడు మండిపడి, ''మళ్ళీ అదే మాటా? విద్యను అమ్ముకోవడం ఎంత సిగ్గు చేటు?'' అంటూ పాత ధర్మపన్నాలే మళ్ళీ పలికాడు.

విద్వాంసుడు కూడా తన పాఠం తాను అప్పగించి, ''రెండు గంటలసేపు వాయిస్తాను. రెండు శేర్ల పాలు ఇప్పించండి. చాలు,'' అన్నాడు.

ధనికుడు బేరం చెయ్యటానికి ప్రయత్నించాడు. కాని విద్వాంసుడు దిగి రాకపోయేసరికి, సరేననక తప్పలేదు.





విద్వాంసుడు రెండుగంటల సేపు వాయించాడు. ధనికుడు అంతసేపూ ఆనందించి వెళ్ళిపోయాడు. కాని పాలు పంపలేదు.

ఆ తరవాత ఆయన నాలుగు రోజుల పాటు విద్వాంసుడి గడప తొక్కలేదు. కాని అయిదో రోజు మళ్ళీ ప్రత్యక్షమై, "మహాశయా, కులాసా? ఏదీ ఆ పాట?" అన్నాడు.

విద్వాంసుడు కొంచెం కోపంగా, "లోగడ మీరు నా సంగీతం రెండు గంటల పాటు హాయిగా విన్నారు గాని, అన్నమాట ప్రకారం రెండు శేర్ల పాలు పంపారు కారు." అన్నాడు.

"పాలు కావాలని మీరు నిజంగానే అన్నారన్నమాట! హాస్యానికి అన్నారను కున్నాను," అన్నాడు ధనికుడు ఎంతో ఆశ్చర్యంతో.

"ఇందులో హాస్యమేమిటి? నాకు నిజం గానే పాలు కావాలి." అన్నాడు, విద్వాం సుడు చుర చురా చూస్తూ.

"సరే, సరే. ఏకంగా నాలుగు శేర్ల పాలు పంపేస్తాను లెండి. ప్రారంభిం చండి," అన్నాడు ధనికుడు.

మళ్ళీ రెండు గంటల సేపు ధనికుడు తనకు నచ్చిన సంగీతం విని ఇంటికి వెళ్ళిపోయాడు. కాని పాలు మాత్రం పంపలేదు.

తరవాత ఆయన అప్పుడప్పుడూ వస్తూ ఉండటమూ, పాట వినడమూ, పాలు పంపిస్తాననటమూ, పంపకపోవ టమూ జరుగుతూ వచ్చింది. పాలు పంప లేదేమని అడిగితే, మరిచిపోయాననో, తరవాత పంపుతాననో బొంకుతూ వచ్చాడు ధనికుడు.

చివరకు విద్వాంసుడు, భార్య ప్రోద్బలం మీద, న్యాయాధికారి వద్ద ధనికుడి మీద ఫిర్యాదు చేశాడు.

న్యాయాధికారి జరిగినదంతా విని, ధనికుణ్ణి పిలిపించి, "నువు ఈ విద్వాంసుడికి నలభై శేర్ల పాలు బాకీ

ఉన్నట్టు తెలుతున్నది. ఏమంటావు ?'' అని అడిగాడు.

న్యాయాధికారికి తనపై దురభిప్రాయం లేకుండా చేసుకోవాలని ధనికుడు, ''నేను అతనికి నలభై శేర్ల పాలు బాకీ పడ్డ మాట నిజమే కాని, ప్రస్తుతం నా దగ్గిర పాల గిన్నెలు లేవు; వాటిని ఎవరో దొంగిలించారు. అందుచేత ప్రస్తుతం ఆయనకు పాలు పంపడం పడదు,'' అన్నాడు.

న్యాయాధికారి ధనికుడి ఎత్తు గ్రహించి ''సరే, పాలగిన్నెలు నీ దగ్గిర లేవని అంటున్నావు గనక, నా తీర్పు ఏమిటంటే: ఈ విద్వాంసుడు నీ ఆవులన్నిటిలోకీ శ్రేష్ఠమైన ఆవు ఎన్నుకుని, తన ఇంటికి తీసుకుపోయి, రెండునెలలు ఉంచుకుంటాడు,'' అన్నాడు.

ఈ మాట వినగానే ధనికుడి నెత్తిన పిడుగు పడినట్టయింది.

''నా ఆవుల్లో కెల్లా శ్రేష్ఠమైనదా? ఎంత అన్యాయం! అది రోజుకు పది శేర్లు పాలిస్తుంది. దాన్ని అతను రెండు నెలలు తన వద్ద ఉంచుకుంటే అతనే నాకు బాకీ పడతాడు,'' అన్నాడు ధనికుడు.

''విద్వాంసుడు నీకు బాకీ పడే మాట నిజమే. అయితే అతను ప్రతిరోజూ మీ యింటికి వచ్చి, పదిగంటల పాటు వీణ వాయించి నీ బాకీ చెల్లు పెట్టుకుంటాడు,'' అన్నాడు న్యాయాధికారి.



తన ఆవులలో కెల్లా మంచి ఆవును ఇచ్చుకోవలసి వచ్చినప్పటికీ, తన కిష్ట మైన సంగీతం రోజూ పది గంటలసేపు వినవచ్చునుగదా అని ధనికుడు సంబర పడ్డాడు.

మర్నాడే విద్వాంసుడు వీణ తీసుకుని ధనికుడి ఇంటికి వెళ్ళి, ఆయనకు ఇష్టమైన పాటలు వాయించసాగాడు. రెండు గంటలసేపు ధనికుడు తల ఆడిస్తూ, చేతులు తిప్పుతూ పాట ఆనం దించాడు. మూడోగంట నుంచీ మెడ నొప్పి పెట్ట నారంభించింది. నాలుగో గంటలో చేతులు పడిపోయాయి. త్వర లోనే ఆయనకు విపరీతమైన తలనొప్పి పుట్టుకొచ్చింది. గంటల తరబడి సాధన చేసే అలవాటు ఉండటం చేత విద్వాం సుడు వాయించుకుంటూ పోతున్నాడు.

ధనికుడు మూలుగుతూ, "బాబూ, మీ పాట ఇవాళకు చాలు! రేపు వింటాను. ఇక చాలించి, ఇంటికి వెళ్ళండి," అన్నాడు.

"అలా అయితే నా బాకీ ఎప్పటికి తీరను? నేను నా ధర్మం ప్రకారం పది గంటలూ వాయించి తీరుతాను," అన్నాడు విద్వాంసుడు.

ధనికుడు విద్వాంసుణ్ణి వీణతో సహా న్యాయాధికారి ఇంటికి తీసుకుపోయి, ఏడుస్తూ, "అయ్యా, ఈ విద్వాంసుడికీ, ఆయన సంగీతానికీ ఒక నమస్కారం! నే నీ బాధను ఇక భరించలేను. రక్షిం చండి!" అన్నాడు.

"మరి అతని బాకీ తీరే దెలాగ?" అన్నాడు న్యాయాధికారి.

"ఆ బాకీ తీరనవసరం లేదు. నన్ను ఈ బాధ నుంచి తప్పిస్తే, అతనికి అయిదు ఆవుల నిచ్చుకుంటాను," అని ధనికుడు పెద్ద పెట్టున ఏడవసాగాడు.

ధనికుడి బాకీ తీరిపోవటమే గాక విద్వాంసుడికి మొత్తం ఆరు ఆవులు లభించాయి. ఆ తరవాత ఆయన నిశ్చిం తగా సంగీత సాధన చేసుకుంటూ జీవించాడు.





# రాజనీతి

పూర్వం కోసలదేశాన్ని కుటిలసేనుడు అనే రాజు పాలించేవాడు. ఆ రాజ్యాన్ని ఆనుకుని మణిపురం అన్న చిన్న రాజ్యం ఉండేది. దానికి రాజు కేశవసేనుడు. అతను నామమాత్రపు రాజు. ప్రజలలో అతనికి ఏమీ పలుకుబడి లేదు. అయిదు గ్రామాలు చేరి ఆ రాజ్యం అయింది. అయిదు గ్రామాలలోనూ అయిదుగురు జమీందార్లు ఉండేవారు.

ఈ పరిస్థితిలో ప్రతి జమీందారుకూ తానే దేశానికి రాజు కావాలన్న ఆశ ఉండేది. వాళ్లందరూ, ఒకరికి తెలియకుండా ఒకరు, తమ కోరిక నెరవేరటానికి కుటిలసేనుడి సహాయం కోరారు. వాళ్ల సహకారంతో కోసలరాజు మణిపుర రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

కుటిలసేనుడు రాజనీతి బాగా తెలిసినవాడు. మనుషులను తన అవసరానికి ఉపయోగించుకుని, అవసరం తీరగానే వదిలి వెయ్యటం అతనికి తెలుసు. అయిదుగురు జమీందార్లూ ఏ ఉద్దేశంతో సహాయం తనకు అందజేశారో అతను సరిగా గ్రహించాడు.

ఆ సంగతి అలా ఉండగా, కోసలరాజు అధీనంలోకి వచ్చేటప్పటికి మణిపుర రాజ్యం చాలా హీనస్థితిలో ఉన్నది. అసలే బీద దేశం. అది అయిదుగురి చేతుల్లో ఉన్న కారణంగా ఏ మాత్రమూ అభివృద్ధి చెందే అవకాశం లేకపోయింది. వాళ్ల ద్వారానే రాజ్యాన్ని బాగు చేయించాలని కుటిలసేనుడు నిశ్చయించాడు.

అతను అయిదుగురు జమీందార్లనూ పిలిచి ఇలా అన్నాడు:

"నాకు మీరు అయిదుగురూ సహాయం చేశారు. అందుకు కృతజ్ఞతతో మీలో ఒకరికి మణిపుర సింహాసనాన్ని కట్టబెట్ట

వీరేపల్లి జయరాంరెడ్డి

నిశ్చయించాను. కాని నేను మీలో ఎవరిని రాజుగా నిర్ణయించినా మిగిలిన నలుగురికీ అన్యాయం చేసినవాణ్ణి అవుతాను. అందు చేత ఈ నిర్ణయం మీ దేశ ప్రజలకే వదులుతాను. మీ గ్రామ సభలవాళ్లు రాజును ఎన్నుకునే ఏర్పాటు త్వరలోనే చేస్తాను."

ఈ మాట వినగానే జమీందార్లు ఆలోచనలో పడ్డారు. ఎవరి గ్రామ సభ వారి పూర్తి అధీనంలో ఉన్నది. మిగిలిన వాటిని ఎలా కూడగట్టుకోవటం? ప్రతి జమీందారూ తన కింద ఉండే గ్రామాన్ని వదిలి, మిగిలిన నాలుగు గ్రామాల అభివృద్ధికి దీక్షగా కృషి ప్రారంభించాడు. అయిదుగురిదీ ఒకటే ఆలోచన! ఎన్నికలలో నెగ్గి, రాజు కావాలి!

డబ్బు మంచి నీరులాగా ప్రవహించింది. ఆలయాలకు ఏనాడూ లేని శోభ వచ్చింది. కొత్త బావులూ, చెరువులూ వచ్చాయి. రహదారులు బాగుపడ్డాయి. దేశానికి కొత్త వన్నె వచ్చింది. ప్రతి గ్రామంలోనూ తమ జమీందారు పట్ల ద్వేషమూ, మిగిలిన జమీందారుల పట్ల అభిమానమూ పెరిగింది.

కొద్ది మాసాల అనంతరం కుటిలసేనుడు అయిదుగురు జమీందార్లనూ పిలిచి ఇలా అన్నాడు:

"మా గూఢచారుల ద్వారా నాకు తెలియవచ్చింది, మీ కెవరికీ మీ గ్రామ ప్రజలలో పలుకుబడి ఉన్నట్టు కనబడదు. మీకింద ఉన్న ప్రజలే మిమ్మల్ని దుమ్మెత్తి పోస్తున్నారు. మీలో ఏ ఒకరూ దేశానికి రాజు అయేటందుకు అర్హుడుగా కనిపించలేదు. అందుచేత ఎన్నికల ఆలోచన కట్టిపెట్టి, ప్రస్తుతం మా ప్రతినిధినే మణిపుర రాజ్య పాలకుడుగా నియమిస్తున్నాము."

అయిదుగురు జమీందార్లూ తమకున్నదంతా ఖర్చు చేసేసి, రాజు కాలేక పోయారు. వారు చేసిన కుట్రా, వారి దురాశా వారిని సాధారణ పౌరులుగా చేసేశాయి.





# తెలివి ఎవరి సొత్తు?

ఒక ఊళ్ళో రాజయ్యా, రాజమ్మా అనే మొగుడూ పెళ్ళాలు ఉండేవారు. రాజమ్మ చాలా బద్ధకం మనిషి, ఎప్పుడూ పరధ్యానంగా ఉండేది. ఆమె ప్రారంభించిన ఏ పనీ సక్రమంగా పూర్తి అయేది కాదు.

రాజయ్య ప్రతి రోజూ ఆమె మీద విరుచుకుపడి, "నిద్రమొహం! మట్టి బుర్ర! పనికిమాలినది!" అని శాపనార్థాలు పెట్టేవాడు. ఆమె వంట చేస్తే అన్నం అడుగంటేది; కూరలు మాడిపోయేవి; పాలు పొంగిపోయేవి; నూకలు ఎండపోస్తే మేకలు తినిపోయేవి. ఆమె ఏ పని చేసినా అవక తవకగానే అయేది.

రాజయ్య గేదె వట్టిపోయింది. మరో మంచి గేదెను కొనడానికి రాజయ్య ముందునుంచే డబ్బు పోగుచేస్తూ అయిదు వందల దాకా చేర్చాడు. పొరుగూరు మంచి గేదెలకు ప్రసిద్ధి. సంత రేపు అనగా రాజయ్య ముందు రోజు రాత్రి గేదెను కొనుక్కు రావటానికి బయలు దేరాడు.

వెళ్ళేముందు అతను భార్యతో, "ఒసే, వెర్రిమొహమా! డబ్బంతా పట్టుకు పొమ్మంటావా? రెండు వందలు ఉంచి, మూడు వందలు పట్టుకు పొమ్మంటావా?" అన్నాడు.

రాజమ్మ నిద్రమత్తుతో ఆవలిస్తూ, "నీ యిష్టం!" అన్నది.

"ఇంట్లో డబ్బు ఉంచటం ప్రమాదమే! నువు గొడ్డులా నిద్రపోతావు. ఎవడో వచ్చి, ఉన్నదంతా ఊడ్చుకుపోతాడు," అన్నాడు రాజయ్య.

"అయితే అంతా పట్టుకుపో," అన్నది రాజమ్మ.

"మూడు వందలకి మంచి గేదే వస్తుంది. ఎక్కువ డబ్బు సంతకు తీసుకు

ఎం. కామేశ్వరరావు

వెళ్లడం దేనికీ? అసలే రోజులు బాగా లేవు. ఇంటి దగ్గిర రెండుపందలు ఉంచే పోతాను. నువు మాత్రం ఒంటి మీద కాస్త తెలివి ఉంచుకో!'' అని రాజయ్య మూడుపందలు మాత్రమే తీసుకుని వెళ్లిపోయాడు.

రాజమ్మ మొగుడు వెళ్లగానే తలుపు మూసుకుని, క్షణంలో గుర్రుపెట్టి నిద్రపోయింది.

అయితే ఈ మొగుడు పెళ్లాల సంభాషణ ఒక దొంగ చెవిన పడనే పడింది. వాడికి రాజమ్మ సంగతి తెలిసిపోయింది. అదీగాక రాజయ్య ఇల్లు కొంచెం మారు మూలగా, ఇతర ఇళ్లకు దూరంగా కూడా ఉన్నది. ఆ ధైర్యంతో వాడు తలుపు తట్టాడు. తలుపు ఎంత బాదినా రాజమ్మ లేచిన అలికిడి లేదు.

ఇక రాజమ్మ లేవదని రూఢి చేసుకుని, దొంగ పెరటివైపు గోడకు కన్నం వెయ్యసాగాడు. వాడు నిర్భయంగా శ్రమపడి, గోడలో తాను దూరగలిగినంత కంతచేసి, చుట్టూ ఒక్కసారి కలయజూసి, నెమ్మదిగా కన్నంలో నుంచి తల లోపలికి పెట్టాడు. వెంటనే వాడి నెత్తిన దభీమని రోకలి పోటు పడింది. దొంగ చావుకేక పెట్టి, కన్నంలోనే మూర్ఛపోయాడు.

వాణ్ణి కొట్టినది రాజమ్మే. దొంగవాడు వీధి తలుపు బాదినప్పుడే ఆమె మేలుకున్నది. అయితే బద్ధకం మనిషి కావటం



చేత లేచి వెళ్ళి తలుపు తీయలేదు. ఆమెకు దొంగ కన్నం తవ్వటం తెలియగానే మెరుపులాటి ఆలోచన వచ్చింది. ఆమె రోకలి తీసుకొచ్చి, వాడి తల మీద ఒక్క పెట్టు పెట్టింది. తరవాత ఆమె వాణ్ణి ఈడ్చుకుపోయి ఒక గదిలో వేసి, గదికి తాళం పెట్టి, నిశ్చింతగా నిద్రపోయింది. తెల్లవారగానే ఆమె నలుగురినీ పిలిచి, దొంగవాణ్ణి వాళ్ళకు పట్టిచ్చింది. అందరూ ఆమెను పొగిడారు.

మర్నాడు సంతలో రాజయ్య ఒక మంచి గమిడిగేదెను చూశాడు. దాన్ని అమ్మేవాడు దాని ధర నాలుగువందలు చెప్పి, ఆఖరు బేరం మూడువందల యాభైకి ఇస్తానన్నాడు. ఇంటి నుంచి డబ్బంతా తెచ్చుకున్నట్టుంటే బేరం పరిష్కారమయి ఉండేది.

అలా చెయ్యనందుకు రాజయ్య తనను తాను తిట్టుకుంటూండగా, ఒక మీసాల ముసలివాడు వచ్చి, "నీకు ఆ గేదె నచ్చింది కదా?" అన్నాడు.

అవునన్నట్టు రాజయ్య తల ఊపాడు.

"అయితే కొనవెందుకూ?" అన్నాడు ముసలాడు.

"గేదె ధర జాస్తిగా ఉన్నది. నా దగ్గిర మూడు వందలే ఉన్నాయి," అన్నాడు రాజయ్య.

"నిజానికి ఆ గేదె నాదే. నేనా మనిషికి బాకీ ఉండి, బాకీ తీర్చలేక గేదెను ఇచ్చేశాను. నువు తప్పకుండా దాన్ని



కొను. అది నీలాటి మంచివాడి చేతిలో పడితే అదే నాకు చాలు,'' అన్నాడు ముసలాడు.

''నా దగ్గిర డబ్బు పూర్తిగా లేదు గద?'' అన్నాడు రాజయ్య.

''నువు ఆ మూడువందలూ ఇలా ఇయ్యి. నేను ఎలాగో అతన్ని బతిమాలి ఆ గేదెను నీకు అప్ప చెబుతాను,'' అన్నాడు ముసలాడు.

రాజయ్య తన వద్ద ఉన్న మూడు వందలూ ముసలాడి చేతిలో పెట్టాడు. తరవాత ముసలాడి జాడలేదు. రాజయ్య చాలాసేపు అతడి కోసం చూసి, చివరకు గేదె గలవాడి వద్దకు వెళ్ళి, ముసలాణ్ణి గురించి అడిగాడు.

గేదె యజమాని రాజయ్యను ఎగాదిగా చూసి, ''ఎవరయ్యా, ఆ మీసాల ముసలాడు? ఈ గేదె మా యింట్లో పుట్టి పెరిగింది. తనదని వాడు చెపితేనమ్మావా? రోజులు బాగా లేక దీన్ని అమ్ముకుంటున్నాను,'' అన్నాడు.

రాజయ్య పిచ్చివాడిలా సంత అంతా కలయ తిరిగాడు, కాని ముసలాడు కనిపించలేదు.

నలుగురూ అసలు విషయం తెలుసుకుని, ఆ ముసలాడు పచ్చి మోసగాడన్న సంగతి బయటపెట్టారు. రాజయ్య సాయంత్రం దాకా చెడ తిరిగి, చీకటి పడి వట్టి చేతులతో ఇల్లు చేరుకున్నాడు.

''కొత్త గేదె ఏదీ?'' అని రాజమ్మ తన మొగుణ్ణి అడిగింది.

రాజయ్య సంతలో జరిగినదంతా పెళ్ళానికి చెప్పాడు. అంతా విని రాజమ్మ ''పోనీలే! ఎంత ప్రాప్తమో అంతే దక్కుడు,'' అని రాజయ్యను ఓదార్చింది.

తరవాత రాజయ్య తన పెళ్ళాం చేసిన పని విని, ఆమెను గురించి తన అభిప్రాయం మార్చుకున్నాడు. ఆ తరవాత అతను ఆమెను ఎన్నడూ, ''తెలివి తక్కువ దద్దమ్మా! నిద్ర మొహం దానా!'' అనలేదు.





# తెలిసిన మూర్ఖుడు

ఒక గ్రామంలో రామన్న అనే ఆయన ఉండేవాడు. అతను పొదుపుగా జీవిస్తూ, తండ్రి తనకు ఇచ్చిపోయిన ఆస్తిని రెట్టింపు చేసుకోగలిగాడు. రామన్నకు వెంకన్న అనే కొడుకు ఉన్నాడు. వాడు లోకజ్ఞానం లేని మందమతి. తాను పూర్వ జన్మలో ఏదో పాపం చేసుకోవటం చేతనే తనకు ఇలాటి కొడుకు పుట్టాడని రామన్న అనుకుంటూ ఉండేవాడు.

ఒకసారి ఆ గ్రామానికి ఒక సన్యాసి వచ్చాడు. రామన్న ఆ సన్యాసి వద్దకు వెళ్లి, "స్వామీ, నేను కొంత పాపం చేసి ఉంటానని నాకు అనిపిస్తున్నది. ఆ పాపం పోగొట్టుకోవటానికి డబ్బు ఎక్కువ ఖర్చు చెయ్యకుండా ఏదైనా ఉపాయం ఉంటే చెప్పండి," అన్నాడు.

"నాయనా, నీకు సూక్ష్మమైన మార్గం చెబుతాను. నువు ఈ ఒక్కరోజు మాత్రం, ఎవరు చెప్పినా వినకుండా, ఎవరు ఏది అడిగినా యిచ్చెయ్యి." అన్నాడు సన్యాసి.

రామన్న వెంటనే ఇంటికి వెళ్ళి, తలుపులు బిగించుకుని లోపల కూర్చున్నాడు. ఇంతలో ఎవరో తలుపు తట్టారు. రామన్న గుండెల్లో రాయిపడింది. అతను లేచి వెళ్ళి, వణికే చేతులతో తలుపు తెరిచాడు. తలుపు తట్టిన వాడు వెంకన్న.

"ఏమిటి, నాయనా? తలుపులు బిగించుకుని లోపల కూర్చున్నావు దేనికి?" అని వెంకన్న తన తండ్రిని అడిగాడు.

రామన్న వాడికి సంగతంతా చెప్పాడు.

వెంకన్న కొంచెం ఆలోచించి, "ఈ ఒక్కరోజే గదా? అడవిలో గడిపేరా! అక్కడ నిన్ను ఎవరూ ధర్మం అడగరు. మన సొమ్ము నష్టం కాదు." అన్నాడు.

తన కొడుక్కు ఇంత తెలివి వచ్చినందుకు ఎంతో సంతోషించి, రామన్న

యం. పెంచలసుబ్బయ్య

ఆ మిట్టమధ్యాహ్నం వేళ కాళ్ళకు చెప్పులు తొడుక్కుని, తలకు గుడ్డ చుట్టుకుని, గొడుగు వేసుకుని, దొడ్డి దారిన ఇల్లు వదిలి, అడవికి బయలుదేరాడు.

దారిలో రామన్నకు ఎవరో ఎదురుపడి, తన కాళ్ళు మాడిపోతున్నాయని చెప్పి రామన్నను చెప్పులు అడిగాడు. ఆ రోజు ఎవరు ఏది అడిగినా ఇయ్యాలి కనక రామన్న తన చెప్పులు ఇచ్చేశాడు.

మరి కొంతదూరం వెళ్ళాక, రామన్నకు చిన్నపాపను తెస్తున్న ఒక స్త్రీ ఎదురుపడి, రామన్న వేసుకున్న గొడుగు అడిగింది. రామన్న ఆమెను తిట్టుకుంటూ గొడుగు ఇచ్చేశాడు. ఇంకా కొంతదూరం వెళ్లాక రామన్నకు ఒక వృద్ధుడు కనపడి, రామన్న తొడుక్కున్న చొక్కా అడిగాడు; రామన్న విధిలేక ఇచ్చాడు.

రామన్న అడవి ప్రాంతాన్ని చేరబోతూండగా ఒక దొంగ అతన్ని అటకాయించి, "మర్యాదగా నీ పంచె విప్పి అక్కడ పెట్టు!" అన్నాడు. రామన్న భయపడుతూ, తలగుడ్డ తీసి కట్టుకుని, తన పంచె తీసి దొంగకు ఇచ్చాడు.

అతను మరి కొంతదూరం ముందుకు వెళ్ళేసరికి, ఒక ధర్మాత్ముడు ఎదురుపడి, "అయ్యా, మీరు వెళ్ళే దారిలో ఊబి ఉన్నది. జాగ్రత్తగా పొండి," అన్నాడు.

సన్యాసి చెప్పినట్టు ఒకరి మాట వినకూడదు గనక, రామన్న ముందుకు వెళ్ళి ఊబిలో పడ్డాడు. దగ్గిరలోనే ఉన్న ఆ ధర్మాత్ముడు వచ్చి రామన్నను పైకి తీయవలసి వచ్చింది.

రామన్న ఇక ముందుకు పోయే ఆలోచన కట్టిపెట్టి, సన్యాసి వద్దకు తిరిగి వచ్చి, ఆయనతో జరిగినదంతా చెప్పాడు.

సన్యాసి నవ్వి, "నేను చెప్పినది నువు సరిగా అర్థం చేసుకోలేదు. అడిగిన వారికి నీకు తోచినది ఇచ్చేటప్పుడు ఇతరులు చెప్పేది వినవద్దన్నాను. ఇకనైనా, లోభితనం మానుకుని, నీకున్న దాంట్లో ఇతరులకు ఇంత పెట్టావంటే, అంతకంటె పుణ్యం ఉండదు," అని చెప్పాడు.






సంపాతి సీత జాడ ఆ విధంగా చెప్పేసరికి వానరులు పట్టరాని ఆనందంతో చిందులు తొక్కుతూ, సింహనాదాలు చేశారు. వాళ్లు లంకకు వెళ్ళే ప్రయత్నంలో సముద్ర తీరాన్ని చేరారు. ఆ మహాసముద్రాన్ని చూడగానే వాళ్ళకు పెద్ద నిరుత్సాహం పుట్టుకొచ్చింది. అది మహాభయంకరంగా ఉన్నది. అందులో భయంకరమైన ప్రాణులున్నాయి. అది ఒక ప్రాంతంలో ప్రశాంతంగా నిద్రపోతున్నట్టు కనిపించినా, అక్కడక్కడ ఎత్తయిన తరంగాలు లేచి విరిగిపడుతూ భయపెట్టుతున్నది. దాని అవతలి ఒడ్డు కనిపించటం లేదు.

''ఇప్పుడేం చెయ్యాలి?'' అని వానరులు తమనుతాము ప్రశ్నించుకున్నారు.

తన వాళ్ళందరూ సముద్రాన్ని చూసి బెదిరినట్టు గ్రహించి అంగదుడు, ''భయపడకండి. భయంవల్ల ప్రయోజనం లేకపోగా అది మననే తినేస్తుంది. ఇది మన పరాక్రమం చూపవలసిన సమయం. పరాక్రమంతోగాని పని జరగదు,'' అని హెచ్చరించాడు.

ఆ రాత్రికి అందరూ సముద్రతీరానే మకాం వేశారు. మర్నాడు తెల్లవారగానే అంగదుడు వానర సేనను సమావేశపరిచాడు. ఆ వానరులను సమావేశపరచగల శక్తి అంగదుడికీ, హనుమంతుడికీ తప్ప మరెవరికీ లేదు.

''మనలో ఏ మహావీరుడు ఈ సముద్రాన్ని దాటి, లంకలో ఉన్న సీతాదేవిని

**10. లంకకు హనుమంతుడి ప్రయాణం**



చూసి తిరిగి వచ్చి, సుగ్రీవుడి ఆజ్ఞ నిర్వర్తించామన్న మాట దక్కేటట్టు చేయగలడు? లంకకూ ఇక్కడికీ మధ్య నూరు యోజనాల దూరం ఉన్నది. దాన్ని దాటగల వాడే మనకు ఇళ్ళకు తిరిగి వెళ్ళే ప్రాప్తి, మన భార్యలతోనూ, బిడ్డలతోనూ సుఖంగా జీవించే ప్రాప్తి మనకు కలిగించగలడు. మనం తిరిగి వెళ్ళి, సుగ్రీవుడికీ, రామ, లక్ష్మణులకూ మన మొహాలు చూపించటానికి అతడే పుణ్యం కట్టుకోవాలి. నూరు యోజనాల సముద్రాన్ని మీలో ఎవరు దాటగలరో చెప్పండి. మా ఆరాటం తీర్చండి,'' అన్నాడు అంగదుడు వానరపరివారంతో.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అందరూ చెక్కిన బొమ్మల్లా ఉండిపోయారు.

అది చూసి అంగదుడు తిరిగి, ''మీరంతా మేటి బలపరాక్రమాలు గలవాళ్ళు! గొప్ప పేరు ప్రఖ్యాతులూ, గొప్ప పుట్టుకలూ కలవారు; ప్రసిద్ధమైన గమనం గలవారు కదా! కనీసం మీరు ఎంతెంత దూరం దాటగలరో చెప్పండి!'' అన్నాడు.

ఈ ప్రశ్నకు కొందరు వానరవీరులు తమ తమ శక్తిసామర్థ్యాలు ఈ విధంగా వివరించారు:

గజుడు తాను పది యోజనాలు దూకగల నన్నాడు; గవాక్షుడు ఇరవైయోజనాలు దూకగల నన్నాడు; గవయుడు ముప్పైయోజనాలు దూకగల నన్నాడు; శరభుడు నలభైయోజనాలు దూకగల నన్నాడు; గంధమాదనుడు యాభై యోజనాలూ, మైందుడు అరవై యోజనాలూ, ద్వివిదుడు డెభ్భై యోజనాలూ, సుషేణుడు ఎనభై యోజనాలూ దూకగలమని చెప్పారు.

తరవాత జాంబవంతుడు, ''దూకటంలో నాకు పెద్ద నేర్పే ఉండేది. ఇప్పుడంటే ముసలివాణ్ణి అయిపోతిని. అయినా రామ కార్యం గనక ఒళ్ళు దాచుకోవటం తగదు. నన్ను మీరంతా దూకమంటే

తొంభై యోజనాలు నిస్సందేహంగా దూకు తాను," అన్నాడు.

అందరూ చెప్పిన మాటలు విన్న మీదట అంగదుడు, "ఈ నూరు యోజనాల దూరమూ నేనే దూకగలను. తిరిగి రాగలనా అన్నదే నా సందేహం," అన్నాడు.

అది విని జాంబవంతుడు, "అబ్బో, నీ శక్తి సామర్థ్యాలు మాకు తెలియవా? నూరు యోజనాలేమిటి, వెయ్యి యోజనాలు కూడా నువు అవలీలగా దూకగలవు! తిరిగి అలాగే వచ్చెయ్యగలవున్నూ! అందులో ఎలాటి సందేహమూ లేదు. కాని నువు రాజువు. అందుచేత నిన్ను పంపటానికి ఎంత మాత్రమూ వీలు లేదు. నువు మాలో ఎవరిని పంపినా పంపవచ్చుగాని, నీవై పోరాదు! నీ క్షేమం చూడటం మా అందరి బాధ్యత! నువు లంకకు వెళ్ళితే మమ్మల్ని ఎవరు చూస్తారు? మేం ఏం చెయ్యగలం?" అన్నాడు.

దానికి అంగదుడు, "సముద్రాన్ని నేనూ దాటక, మీలో ఎవరూ దాటలేక పోతే మనమంతా ప్రాయోపవేశంచేద్దామా? పని పూర్తి కాకుండా కిష్కింథకు తిరిగి వెళ్ళి ప్రాణాలతో ఉంటామన్న ఆశ లేదుగదా! ఆ సుగ్రీవుడు మనని తప్పక



చంపించేస్తాడు. అందుచేత, మాలో పెద్ద వాడివైన నువు పని జరిగే మార్గం ఏమిటో బాగా ఆలోచించి చెప్పు!" అన్నాడు జాంబవంతుడితో.

దానికి జాంబవంతుడు అంగదుడితో, "పని జరిగి తీరుతుంది. ఈ పని చెయ్యగల వాణ్ణి, ఇదుగో చూపిస్తాను," అని, ఒక పక్కగా ఏమీ పట్టనట్టు కూర్చుని ఉన్న హనుమంతుణ్ణి సమీపించి ఇలా అన్నాడు:

"హనుమంతుడా, నువు వానర వీరులలో కెల్లా మేటివీ, సమస్త శాస్త్రాలూ చదివినవాడివీ అయి ఉండి కూడా, మాటా పలుకూ లేకుండా ఇలా కూర్చుని



ఉన్నా వేమిటి? ఆ గరుత్మంతుడి రెక్కలకు ఉన్నంత బలం నీ బాహువులకున్నది. పరాక్రమంలో నువు సుగ్రీవుడికీ, లక్ష్మణుడికీ తీసిపోవు. ఇక ఇతర ప్రాణులను నీతో పోల్చటానికే లేదు. ఈ సంగతి నీకు తెలీదా? నాయనా, నువు పుట్టుతూనే సూర్యుణ్ణి చూసి పండుగా భ్రమపడి మింగటానికి ఆకాశంలోకి ఎగిరావే, దూకటంలో నీకు సాటి ఎవరు? మా అందరికీ నీ శక్తి ఇప్పుడు చూపించు. ఈ సముద్రాన్ని దాటు."

ఈ మాటలు వినగానే అత్యద్భుతంగా హనుమంతుడి శరీరం విపరీతంగా పెరిగిపోయింది. హనుమంతుడు సముద్రాన్ని దాటటానికి సంసిద్ధుడు కావటమూ, అతని శరీరం పెరగటమూ చూసి మిగిలిన వానరలు పరమానంధంతో అతన్ని ప్రశంసిస్తూ పెద్దగా సింహనాదాలు చేశారు.

వానరులు మెచ్చుకుంటున్న కొద్దీ హనుమంతుడు వామనుడిలాగా పెరిగిపోయాడు. అతని బలపరాక్రమాలు కూడా పెరిగాయి. అతని ముఖం ఎర్రగా, పొగ లేని నిప్పులాగా ఉన్నది.

అప్పుడు హనుమంతుడు లేచి నిలబడి, వృద్ధ వానరులకు నమస్కారం చేసి, "నేను సముద్రాన్ని వాయువు దాటినంత సులభంగా దాటుతాను. మధ్యలో ఎక్కడా ఆగను. నేను ఉదయగిరి నుంచి సూర్యుడితో బాటే బయలుదేరి, అతని కన్న ముందే అస్తగిరి చేరి, అతనికి ఎదురుగా రాగలను. నేను ఆకాశంలో వెళ్ళే వేగానికి సముద్రం నా వెంట రాగలదు. నేను సముద్రం దాటేటప్పుడు ఆకాశంలో మేఘాలు చెల్లా చెదరవుతాయి; పర్వతాలు కంపిస్తాయి. నేను తప్పక సీతను చూసి వస్తాను. నాకు మంచి శకునాలు కనబడుతున్నాయి. అవసరమైతే లంకను మొత్తంగా పెల్లగించి, భుజానవేసుకొని వెంట తెస్తాను," అన్నాడు.

హనుమంతుడు ఇలా చెబుతుంటే వానరులకు ఆనందంతో బాటు ఆశ్చర్యం కూడా కలిగింది.

జాంబవంతుడు అతనితో, "నాయనా, నువు మా అందరి బాధా పోగొట్టావు. నువు వెళ్ళే పని నెరవేరగలందులకు మేమందరమూ ధ్యానిస్తాం. మా ఆశీర్వచనాలతో నువు సముద్రాన్ని దాటు. మా అందరి ప్రాణాలూ నీ చేతిలో ఉన్నాయి," అన్నాడు.

"నేను పైకి ఎగిరేటప్పుడు నా పాదాల తోపుడుకు భూమి ఆగదు. అందుచేత నేను ఈ మహేంద్ర పర్వతం మీది నుంచి ఎగురుతాను," అంటూ హనుమంతుడు, వేగంగాపోయి ఆ పర్వతం పైకి ఎక్కాడు.

అతను పర్వతం మీదికి వెళ్ళి, ఎగిరే ముందు పర్వతాన్ని చేతులతోనూ, కాళ్ళతోనూ ఊపి చూశాడు. అచలంగా ఉండవలసిన ఆ పర్వతం చాలాసేపు కంపించిపోయి, దాని మీద వున్న చెట్లపూలన్నీ రాలిపోయాయి; రాళ్లు దొర్లాయి; పర్వతం మీది గుహలలో ఉండే జంతువులు వికృతంగా ఏడ్చాయి. పర్వతం మీద ఉండే ఋషులూ, విద్యాధరులూ పర్వతం బద్దలైపోతున్నదని భయపడ్డారు. విద్యాధరులు తమ స్త్రీలతో సహా ఆకాశంలోకి



లేచారు. వాళ్ళకు మహాకాయుడైన హనుమంతుడు కనిపించాడు.

హనుమంతుడు గాలిలోకి లేవబోతూ తన తోకను విదిలించి, చేతులు బిగబట్టి, కాళ్ళు వంచి, శ్వాస స్తంభించి, తాను పోబోయే ఆకాశ మార్గం చూసుకుని వానరులతో, "నేను లంకకు పోతున్నాను. అక్కడ సీత కనిపించకపోతే, అక్కడి నుంచి తిన్నగా స్వర్గానికే వెళతాను. అక్కడ కూడా సీత కనబడకపోయిందో, తిరిగి లంకకు వచ్చి రావణుణ్ణి బంధించి తెస్తాను. లేదా, రావణుడితో సహా లంకనే తెస్తాను," అన్నాడు.



అతనితో పాటు కదులుతున్నది. అతను వెళ్ళే దిక్కుగా సముద్రం తెర్లుతున్నది.

అలా వెళుతున్న హనుమంతుణ్ణి చూసి సముద్రుడు ఇలా అనుకున్నాడు: ''నేను ఈ హనుమంతుడికి సహాయం చెయ్యాలి. ఇతను ఇక్ష్వాకు కులానికి చెందిన రాముడి నిమిత్తం వెళుతున్నాడు. నన్ను ఉద్ధరించిన సగరుడు ఇక్ష్వాకు కులం వాడేగద! ఆయన పేరనే నాకు సాగరం అన్నమాట వచ్చింది గద! అందుచేత ఈ హనుమంతుడికి లంకకు పోయే మధ్య దారిలో కొంత విశ్రాంతి కలగజేస్తాను.''.

ఇలా చెప్పి హనుమంతుడు ఆకాశం లోకి ఎగిరాడు. అతనితోబాటు అనేక చెట్లు కూడా లేచాయి. అతని శరీరం నిండానూ, సముద్రం నిండానూ పూలు రాలాయి. చాచిన హనుమంతుడి చేతులు అయిదు తలల పాముల్లాగా ఉన్నాయి. అతని కళ్ళు సూర్యచంద్రులు ఒకేసారి ఉదయించినట్లుగా ఉన్నాయి. అతని తోక నిటారుగా పైకి లేచి ఉన్నది.

హనుమంతుడు అతివేగంగా పోతూంటే అతని చేతుల కిందుగా గాలి చేసే ధ్వని మేఘగర్జనలాగా ఉన్నది. అతను లంకకు చేటు కలిగించే తోకచుక్కలాగా ఉన్నాడు. అతని నీడ సముద్రం మీద

ఇలా అనుకుని సముద్రుడు మైనాకుడనే పర్వతంతో, ''మైనాకుడా, నిన్ను ఇంద్రుడు పాతాళంలోని రాక్షసులు పైకి రాకుండా మూసి ఉంచమని ఆదేశించాడు గదా! నువ్విప్పుడు నీటి అడుగు నుంచి పైకి పెరగాలి. హనుమంతుడు నువ్వుండే దారి మీదుగా ఎగిరిపోతున్నాడు. అతను నిన్ను దాటి ముందుకు వెళ్ళిపోక మునుపే, నీ బంగారు శిఖరాలను నీటిపైకి పెంచి, వాటి పైన హనుమంతుడు విశ్రమించే సదుపాయం చెయ్యి.'' అన్నాడు.

వెంటనే మైనాకపర్వతం నీటిపైకి పెరిగింది. అది, చూడటానికి, తూర్పు సముద్రంలో నుంచి పైకిలేచే సూర్యుడులాగా

ఉన్నది. ఆ పర్వతం తన దారికి అడ్డంగా పైకి పెరగటం చూసి, హనుమంతుడు తనకు ఆ పర్వతం విఘ్నం కలిగించ జూస్తున్నదనుకున్నాడు. ఈ అపోహతో హనుమంతుడు గట్టిగా హుంకరించి ఆ పర్వత శిఖరాన్ని తన రొమ్ముతో ఒక్క తోపు తోసి, పడగొట్టాడు.

అంతులేని హనుమంతుడి బలం చూసి మైనాకుడు పరవశుడై, మానవ రూపంలో పర్వత శిఖరాన ప్రత్యక్షమై, "హనుమంతుడా! నీ బలం ఎలాటిదని చెప్పాలి? ఏ ప్రాణికీ సాధ్యంకాని విధంగా సముద్రాన్ని లంఘిస్తూ కూడా, ఏ మాత్రమూ అలసట చెందకుండా, నీ బలంతో నన్ను పడదోయగలిగావే! కొంచెంసేపు ఈ శిఖరం మీద విశ్రాంతి తీసుకో! సముద్రుడు, రాముడికి పూర్వ పురుషుడైన సగరుడి వల్లా, అతని కొడుకుల వల్లా చాలా మేలు పొందాడు. ఆ కారణంగా సముద్రుడు, రామకార్యం మీద పోతున్న నీకు, తగిన సత్కారం చేసి, సగరవంశానికి కృతజ్ఞత చూపగోరుతున్నాడు. అందుచేత నువు ఇక్కడ కొంచెంసేపు విశ్రమించి నీ దారిన వెళ్లు," అన్నాడు.

మైనాకుడు హనుమంతుడితో ఇంకా ఇలా అన్నాడు:

"వాయుదేవుడి కొడుకువుగా కూడా నేను నిన్ను పూజించవలసి ఉన్నది. దానికి కారణం ఉన్నది. కృతయుగంలో పర్వతాలకు రెక్కలుండేవి. అవి గాలిలో తిరిగేటప్పుడు కిందపడతాయేమోనని దేవతలూ, ఋషులూ భయపడేవారు. అది తెలిసి దేవేంద్రుడు తన వజ్రాయుధంతో అనేకవేల పర్వతాల రెక్కలను ఖండించాడు. అతను నా రెక్కలను ఖండించటానికి వస్తూండగా వాయుదేవుడు చూసి, నన్ను కాపాడటానికి దూరంగా నెట్టుకుపోయి, సముద్రంలో పడేశాడు. ఆ విధంగా నేను వాయుదేవుడికి ఋణపడి ఉన్నాను. కనక, నువు నా ఆతిథ్యం స్వీకరించు. నిన్ను చూడటం నాకు ఎంతో ఆనందంగా ఉన్నది."






యః ఏవ నైవ కుప్యంతే,
న లుభ్యంతి తృణేష్వపి,
తఏవ నః పూజ్యతమాః
యే చాపి ప్రియవాదినః. 1

[కోపంలేనివారూ, గడ్డిపరకకు సైతం లోభపడని వారూ, మంచిగా మాట్లాడేవారూ మనకు పూజనీయులు.]

య స్సముత్పతితం క్రోధం
క్షమ యైవ నిరస్యతి
యథోరగస్త్వచం జీర్ణాం,
స వై పురుష ఉచ్యతే. 2

[ఎవడైతే కోపాన్ని సహనం ద్వారా, పాము కుబుసాన్ని విడిచినట్టు విడుస్తాడో, వాడే నిజమైన మనిషి.]

క్షమా శస్త్రం కరే యస్య
దుర్జనః కిం కరిష్యతి ?
అతృణే పతితో వహ్నిః
స్వయమే వోపశామ్యతి. 3

[ఓర్పు అనే ఆయుధం గలవాణ్ణి దుర్జనుడు ఏం చేయగలడు ? గడ్డి లేనిచోట పడిన నిప్పు దానంతట అదే ఆరిపోతుంది.]

క్షమ

Photo by S. B. Takalkar



బహుమతి
పొందిన వ్యాఖ్య

చిరునవ్వు వెలుగులో

పంపినవారు :
జి. వెంకటరావు

Photo by S. B. Takalkar



టి. టి. సి. అబీడ్స్,
హైదరాబాదు.

చీకట్లు తొలగు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జూలై 20వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోష్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
ప్రతిబింబం

మూడవ అట్ట:
పాదస్నానం


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3. Arcot Road, Madras-600026. Controlling Editor : 'CHAKRAPANI'

శ్రీరామ చిత్ర వారి రంగుల సినిమా

# ముత్యాల ముగ్గులో రాము కథ





నా పేరు రాము. నా ఫ్రెండు కోతిపిల్ల - రాజులు. మా చెల్లాయి పేరు శాంత. ఇద్దరం ఒకేసారి పుట్టాం - అయినా తనే పెద్ద అంటుంది. దానికేం తెలీదు. పైగా పిరికి. కాస్త చీకటి పడితే చాలు గబగా కళ్ళు మూసుకుని అంజనేయ స్వామిని పిలుస్తుంది. పిలిస్తే అయ నొస్తాట్ట - కథలు చెప్తాట్ట. ఇంటి దాకా సాయం వస్తాట్ట. అన్నీ కోతలే కదా!

మా అమ్మ చాలా మంచిది. పాపం మా నాన్న తప్పిపోయాడని ఏడుస్తూ వుంటుంది.

కొన్నాళ్ళు పోయాక మా తాతగారొచ్చారు. అపుడు అసలు సంగతి తెలిసింది. మా నాన్నకి అమ్మ మీద కోపం వచ్చి ఇంట్లోంచి వెళ్ళిపొమ్మన్నాట్ట - తాతగారేమో ఇంటికి రమ్మని పిలిచినా, నాన్నొచ్చి పిలిస్తే గాని రానని అమ్మ ఏడుస్తూ చెప్పింది—

అపుడు నేనూ కోతిపిల్ల రాజులూ నాన్నని తీసుకొద్దామని బయలుదేరుతూంటే తాతగారొచ్చి ఏమేం చెయ్యాలో చెప్పారు. ఈలోగా శాంత స్వామితో బాటు



నేనూ వస్తానూ అంటూ వెంటబడింది. చిన్నపిల్ల కదా సరే అన్నాను.



ఆంజనేయస్వామి గుడి దగ్గర అలో అలో వాడు జోగినాథం అనేవాడూ కనిపించారు. వీళ్ళేట నాన్నకి అమ్మ మీద చాడీలు చెప్పి కోపం తెప్పించి ఇంట్లోంచి వెళ్ళగొట్టించింది. మా తాతగారు చెప్పారుగా — నేనూ రాజులూ వెళ్లి వాళ్ళని అపుడే కొట్టి చంపేద్దుం. కానీ అలా చెయ్యకూడదుగా వాళ్ళంతట వాళ్లేవచ్చి నాన్న దగ్గర నిజం చెప్పాలి. అందుకని నేనూ రాజులూ అలో అలో వాడితో జట్టు కట్టి వాడింట్లో చేరి వాడి సంగతులన్నీ కనిపెట్టేశాము.

వాడి ముఠాలో వాళ్ళందరికి ఒకళ్ళ మీదొకరికి పితూరీలు చెప్పి దెబ్బలాట్లు పెట్టేశాను. రాజులేమో జోగినాథాన్ని కరిచేసింది - వాడికి కోతి పిచ్చెక్కింది. అలో అలో వాడు తను చేసిన తప్పులన్నీ నాన్న వినేట్లు చెప్పించేశాను. జోగనాథం వాడు అలో అలో వాణ్ణి కరిచేశాడు - అప్పుడు ఆ చెడ్డ వాళ్ళందరూ కొట్టుకుంటూంటె పోలీసులొచ్చి తీసుకెళ్ళిపోయారు.

అమ్మ నాన్నా కలుసుకున్నారు. ఇదంతా నేనూ రాజులూ కదా చేసింది. కాదూ - నేనూ స్వామీ చేశాము అంటుంది శాంత. నా క్కోపం వచ్చింది కానీ చిన్నపిల్ల కదా - సరే అనేశాను.







శ్రీరామచిత్రవారి రంగులసినిమా

# ముత్యాలముగ్గులో శాంతకథ

నా పేరు కె. శాంత. ఫోర్త్‌క్లాస్ సెక్షన్ బి. మా తమ్ముడి పేరు రాము - వాడూ నేనూ ఒకేసారి పుట్టాం. కానీ వాడేమో నేనే పెద్దవాణ్ణి - నువ్వు చెల్లాయివి అని పోట్లాడతాడు.

ఓ రోజు నేను స్కూలునించి వస్తూంటే బాగా చీకటి పడింది - అప్పుడు బయమేసింది. బయమేస్తే అంజనేయస్వామిని తలుచుకోమని అమ్మ చెప్పింది. కళ్ళు గట్టిగా మూసుకుని 'స్వామీ యింటికి సాయంరావా' అని పిలిచాను. వెంటనే ప్రత్యక్షమై 'పద బంగారూ ఇంటికెళ్దాం' అన్నాడు. దోవలో రాములవారి కథ చెప్పాడు. లంకలో తోకకి నిప్పంటించడం- అప్పుడేమో అలా పైకెగిరి లంకలో ఇళ్ళన్నీ కాల్చెయ్యడం అన్నీ చెప్పాడు—'మరి నీ తోక మండలేదూ' అని అడిగితే, లేదుగా - సీతమ్మ తల్లి దీవించిందిగా! అన్నాడు స్వామి దణ్ణం పెట్టుకుంటూ-

ఇలా స్వామి తోడు వచ్చాడూ అంటే తాతగారు, అమ్మ నమ్మారు గానీ తమ్ముడు మాత్రం 'కొయ్ కొయ్' అని ఎగతాళి చేశాడు. ఎంత చెప్పినా నమ్మలేదు.

వాడొట్టి అల్లరివాడు. ఎప్పుడూ ఆ కోతిపిల్ల రాజుల్ని బుజం ఎక్కించుకుని గోటీబిళ్ళ ఆడుతూంటాడు. అమ్మేమో నాన్న తప్పిపోయాడని అసలే ఏడుస్తుందా - ఇపుడు ఏడికోసం.

కొన్నాళ్ళు పోయాక మా నిజం తాతగారు వచ్చారు. ఆయన పెరట్లో అమ్మతో మాట్లాడుతూంటే అసలు సంగతి తెలిసింది. నాన్న అమ్మని వెళ్ళగొట్టేశాట్ట.





తాతగారు పాపం తీసికెడతానన్నా - నాన్నొచ్చి పిలిస్తేగాని రాను అంది అమ్మ ఏడుస్తూ. ఇదంతా ఆంజనేయస్వామితో చెప్పాను.

అమ్మగురించి చెడ్డగా చెప్పిన రాక్షసుల్ని చంపేసి నాన్నని బుజం మీదెక్కించుకుని తీసుకొచ్చేద్దాం అన్నాడు స్వామి. స్వామి కెప్పుడూ తొందరేకదా. రాములవారు చూసి రమ్మంటే కాల్చి వచ్చాడు. అలావద్దూ మా పక్కనే వుంటేచాలూ - కొండంత బలం ఇచ్చి దీవించు అన్నాను.

నేను రామూ నాన్నని తీసుకు రావడానికి బయలుదేరుతూంటే - తాతగారొచ్చి ఏమీ చెయ్యాలో చెప్పారు.



ముందస్తుగా ఆంజనేయస్వామి గుడి కెళ్ళాం. అక్కడ ఒక రాక్షసుడు కనబడ్డాడు. వాడేటఅమ్మని వెళ్ళగొట్టించింది. స్వామికి చెప్తే గద తీసుకుని కొట్టబోయాడు. వాడు శ్రీరామచంద్రా అన్నాడు. స్వామి గద దించేశాడు. మరి రామరామ అంటే స్వామి కొట్టడు కదా!

అప్పుడేమో నేనూ స్వామీ కలిసి మా నాన్న ఇంటికెళ్ళాం. నాన్నతో జట్టు కట్టి కబుర్లు చెప్పి నవ్వించాను. ఆంజనేయస్వామి దయవల్ల అమ్మ నాన్న మళ్ళీ కలుసుకున్నారు. ఇంతచేసినా స్వామీలేదు ఏంలేదూ అంతా నేనే చేశాను అంటాడు మా తమ్ముడు. నా కోపం వచ్చింది గానీ స్వామికి కోపం రాలేదు. నవ్వేసి రాముని కూడా దీవించాడు.



